వేల సంవత్సరాల ఒడిలో
ఒంటరినయ్యాను
సమూహమయ్యాను
కష్టమే నా తలమీది తురాయి
నా కవచమూ ఆయుధమూ ఒక్క కష్టమే
ఇవాళ్టికీ
నా యుద్ధం
కత్తితోనే కాదు
శరీరాన్ని బోనుచేసి
మనుసుమీద మసిపూస్తున్న
నాగరిక సంస్కృతితోనూ



# ప్రాణహిత

## నందిని సిధారెడ్డి



**PRANAHITA**
Poems by
**Nandini Sidhareddy**

July 1995

Cover Design :
**Seela Veeraju**

Photo :
**D. Surender Reddy**

Rs. 18

FOR COPIES :

**Manjeera Rachayithala Sangam**
11–2–47/3/1, Bharath Nagar, Siddipet – 502 103.

**Navodaya Book House**
Opp. Arya Samaj Mandir, Kachiguda, Hyderabad.

**Visalandhra Book House**
Bank Street, Hyderabad.

---

Composed at :
**Lakshmi Graphics**, 2–1–476, Nallakunta, Hyderabad.

Printed at :
**Charita Graphics** Offset Printers, Chikkadpally, Hyderabad.

*చంద్రునికి లేని కాంతి*
*ఇంద్రనీలమణులకు లేని కాంతి*
*ఈ నక్షత్రాలకెక్కడిది?*

*భాగ్య పద్మాలకు*
*సూర్యసాగర సముద్రాలకు*

## జీవకళలు

ఎవరో కొమ్మ నరికినప్పుడు
గుబురుల్లో ఉన్న గూడు చెదిరి
అరుపు నేర్వని కాకిపిల్ల భూమ్మీదపడి
ఆయాస పడుతున్నప్పుడు
నేను భాష నేర్చివుంటానేమో -
మాటమాటకు విషాదం పొరలు కమ్ముతుంది

పచ్చిక మైదానం మీద
నయనానందంగా పరుగెత్తుతున్న
ఎడ్లబండి గీర
బండరాయెక్కి విరిగినపుడు
నేను నడక నేర్చివుంటానేమో -
అడుగు అడుగులో ఎదురు దెబ్బలు వేటాడుతున్నాయి

చేసిన కష్టం మట్టిపాలయి
నాట్లేసిన పొలం పెదవ్విరిచి వెక్కిరించి
అప్పు కట్టమని బజారుకు గుంజినపుడు
పంచాయతిలో తలవాల్చి
నాతండ్రి
నేలమీద గీతలు గీస్తున్నప్పుడు
నేను రాతనేర్చి వుంటానేమో -
కలం విదిల్చినపుడల్లా కన్నీళ్లు రాలుతుంటాయి

సంసారాన్ని వలపోసుకుంటూ
పొయ్యి ముందు కూచుని
వొచ్చే ఏడుపాపుకుంటూ
ఉడకని అన్నాన్ని చూసి
నాతల్లి
అదేపనిగా మంట ఎగదోస్తున్నప్పుడు
నేను ఆలోచించటం నేర్చివుంటానేమో -
అణువు అణువునా నిప్పుసెగలు చెరుగుతుంటాయి

*22-9-93 సాయంత్రం*

# వుట్టి తెగినవాళ్లు

వుట్టి తెగిపోయింది
వుట్టి మునిగిపోతున్నది
వురితాడు ఒక్కటే కన్నీళ్లు తుడుస్తున్నది
ఏడ్చి ఏడ్చి కళ్లు ఉబ్బుతున్నాయి
మాడ్చి మాడ్చి కడుపు అంటుకపోతంది
చుట్టూ మనుషులే
రంగుల శాలువాలు కప్పుకొని
ఎస్కులేటర్లమీద తేలిపోతున్నారు
పాలించేవాళ్లూ మనుషులేనట

ఎవరికీ వినికిడి సమస్య కాదు
వినదల్చుకోకపోవటమే సమస్య
అంధత్వమెవడికీ లేదు
చూడదల్చుకోక పోవటమే సుఖం
వుట్టి తెగిపోయింది
వురితాడు ఒక్కటే ఊహాహస్తాలు చాచి ఆహ్వానిస్తున్నది
గిన్నెలో అన్నమే లేకపోతే
వుట్టెందుకు?
వుట్టి తెగిపోయింది

★

వాళ్లు బతుకే మగ్గం చేసుకున్నరు
ఆరాటాలన్ని పోగులు వడికి
కలలన్నీ అద్ది
వస్త్రాలు నేసింది వాళ్లు
ఇంత పత్తి మొహాన కొడితే
అంత వస్త్రం తయారుచేసింది వాళ్లు

చలికత్తులు కోతవెడుతుంటే
శద్దర్లూ శాలువాలూ ఎవడి పుణ్యం?



ఉక్కపోతలో ఉడుక్క చస్తావని
ఉల్లిపొర బట్టలు ఎవడి సదుపాయం?
కడుపు పండి
పసిపాపగా భూమ్మీద పడ్డప్పుడు
ఒలికిన మైలను తుడిచిందే - బట్ట
ఎవడి శ్రమ?
కన్నీళ్లు తుడిచే తువ్వాళ్లు ఎవల చలువ?
ఎన్నికల రుతువులో
మీ హామీలు వేలాడే బ్యానర్లు
మీ గుర్తులు ఎగరేసే జెండాలు ఎక్కడ్నుంచొచ్చాయి
ఆదిమస్థితి ఆకుల అలంకరణ నుంచి
నాగరికుణ్ణి చేసి
మహత్తర వస్త్రాలు మనకిచ్చింది వాళ్లు

మానాన్ని కాపాడినవాడి
అభిమానాన్ని కాపాడలేని ద్రోహరాజ్యమిది

★ ★

వుట్టి తెగిపోయింది
వురితాడు ఒక్కటే ఉయ్యాల వూగుతున్నది
ఇన్ని వర్షాల చరిత్ర సంస్కృతి భారమై
వాళ్ల బతుకులలో
కడుపు చంపుకోవటమొక్కటే మిగిలింది
నిద్రలో మెలకువలో
కూలిపోయిన మగ్గమొకటే కనిపిస్తున్నది
జీవితం మగ్గం చేసుకొన్నవాళ్లు
విరిగిన మగ్గంతో ఎట్లా జీవిస్తారు?
అగ్గిపెట్టెలో పట్టే చీరను నేసిన
అద్భుత పనితనం వాడిది
ఇప్పుడా అగ్గిపెట్టె
తగులబెట్టుకోడానికి పనికొస్తుంది

★ ★ ★

ఒక్క స్త్రీకి ఒకసారి బట్టలిచ్చినవాన్ని
ఇప్పటికీ పూజిస్తాం
ఇందరు స్త్రీలకు ఇన్ని కాలాలుగా
బట్టలిచ్చినవాన్ని
ఇంత సానుభూతి స్పర్శించదా
నేతగాళ్ల కష్టమ్మీద
నేతలయిన వాళ్లకు
పదవొక్కటే కనబడుతుంది
చేనేతగాళ్లకు ఉరి ఒక్కటే సేదదీరుస్తున్నది
నూలు ధరలో గోలుమాలు చేసినవాళ్లకు
ప్రాణాలూ అభిమానాలు లెక్కా
ఫైన్ నెంబరు నూలు పని నేర్చినందుకు
బతుక్కే ఫైను పడింది

భూమి ముఖం మీది తెల్లటి చిర్నవ్వు పత్తి
పత్తిని పండించిన నేరానికి
రైతు ఆత్మహత్యలు చేసుకున్నాడు
పత్తిని వస్త్రంగా మార్చి
మనిషి మొల జలతారు నలంకరించిన నేరానికి
నేతకారుడు ఆత్మహత్యలు చేసుకుంటున్నాడు

ఏదీ కొత్తకాదు
హత్యలూ ఆత్మహత్యలూ
ధర్మచక్రం తిప్పే మర్మవంచకుడికి ఏది కొత్త?
పుట్టి తెగినవాళ్లు
విరిగిన మగ్గం పట్టుకుని
వీధులకెక్కటమే మిగిలింది
మనిషి చావును ఎగతాళి చేస్తున్నవాళ్లను
మనసు విరిగినవాళ్లే శపించాలి
మనుగడ విరిగిన మనుషులే కోపించాలి

*1-11-91 తెల్లవారుజాము*



## పోస్ట్‌మార్టమ్ గదినుంచి

దినదిన శవ సందర్శనలో
తెల్లబోయిన గది
అమాయకంగా చూస్తోంది
శ్వాస కష్టంగా వుంది
శవాల వాసన దండెత్తుతున్నది
తలుపులూ గోడలూ తన్నుకొని
కుళ్లిన శాపనార్థాల వాసన గుప్పుమంటున్నది
కన్నీటి మట్టం ప్రమాద సూచిని దాటుతున్నది
పెళ్లికూతుర్లా శోభాన్వితమైన పచ్చటి చెట్టు గాలికి వణుకుతున్నది
దాన్ని రకరకాల సైజుల్లో కోయటానికి
కోత మిషన్ సదా ఎదురు చూస్తుంది
గుండెకోత ముందు
జీవితం ముకుళిత హస్తమై శిరసొంచుతుంది
గుండెకోత ముందు
జీవన వాంఛ ఒక్కోసారి ఓడిపోతుంది

సఫకేషన్
శ్వాస కష్టంగా వుంది
మనం చేసే సవాలక్ష కుట్రల్లో 'శవపరీక్ష' ఎన్నోది?

బాధల్ని పసిగట్టడానికి పరికరాల్లేవు
మంటలు చల్లార్చటానికి మందుల్లేవు
హృదయం కుతకుత ఉడుకుతున్నప్పుడు
కన్నెత్తయినా చూడనివాళ్లు
చచ్చాక కత్తులు పట్టుకొని 'పరీక్ష'కు పూనుకుంటారు
కన్నీళ్లకు పరీక్ష లేనపుడు
మనసుకు పరీక్ష లేనపుడు
ఆగమయిన బతుక్కు పరీక్ష లేనపుడు
మృత కళేబరానికి పరీక్షేమిటి?

చేతులూ చేష్టలూ శుభ్రం చేసుకోవటం తప్ప
శవపరీక్షలో తేల్చిందేమిటి?
పోలీసులూ డాక్టర్లూ లాయర్లూ బాటుపడటానికి తప్ప
చచ్చిన శవాల్ని
నిలువునా అడ్డంగా కోసి ఏమి తేల్చారు గనక
కాల్చితే ఏమి? కాల్చుకుంటే ఏమి?
కొత్త చాపలో
అందమైన మిత్రురాలి శవం చుట్టి మోసుకు రావటం కంటే
దౌర్భాగ్య మేముంది?
చాప సందులోంచి
గచ్చుమీద వికారంగా రాలిన నెత్తురు చుక్కలు
ఇంకా నా కళ్లలో రాలుతున్నట్టే వుంది
శవాన్ని అప్పగించి వాళ్లు చేతుల్దాపినపుడు కూడా
నెత్తురు తడి ఆరలేదు
పోస్ట్‌మార్టమ్ గదినుంచి
వెనుదిరిగేటప్పటికి
నన్నొక జీవితం అల్లుకపోయి
ఒత్తిగిలి ఒత్తిగిలి
ఏడుస్తూ తుడుస్తూ
ఎత చెబుతున్నట్టే
ఎంత అశాంతి

*23-8-92* తెల్లవారుజాము



# పెనుగులాట

ఒగ బాధకాదు
ఒగ దుఃఖం కాదు
రాగి చెంబుకంటే సులువుగా
జీవితం తాకట్టు పడుతుంది
బీర తీగంత సుతారంగా తీగవారిన మనసు
వాడిపోతుంది

తేనెటీగలు బజారుపాలయి
తేనెలేని తుట్టె తెల్లగా వేలాడుతుంది
వంటింట్లో ఏమీ మిగలనట్టె
వంట్లో ఏమీ మిగలదు
సొనలేని డొల్ల మటుకు
అట్నుంచిటూ ఇట్నుంచటూ సొలుగుతూ దొల్లుతుంది.

ఉన్నతమైన ప్రేమలల్లు కోవాల్సిన ఇంట
ఊసులు బంతిపూల సొగసులు కావాల్సిన ఇంట
అన్యోన్య పరిమళాలు ఆకాశాల్ని కుదపాల్సిన ఇంట
కాపురం వికృత క్రీడా విశేషమైంది
ఒగ కత్తికాదు
ఒగ వేటుకాదు
దెబ్బలూ పెడబొబ్బలతో
దేహాలు ఉడుకుతాయి
పంచుకునే సమయానికి
పాలు విరిగిపోతాయి
ఎగతాళి జీవితం పొడుగునా వ్యాపిస్తుంది
ఎటుపక్కకు పార్లినా
అప్పు పల్లేరుగాయలా గుచ్చుకొంటుంది

ఒగ మోసం గాదు
ఒగ దుర్మార్గం గాదు

రౌడీ కిరీటాలు ధరించి
కాంట్రాక్టు దేవుళ్లు కార్లు దిగుతారు
కలెక్టరాఫీసులో
కన్నీటికి వేలంపాట పాడుతారు
గొప్ప తెలివితేటలన్నీ
గొప్ప గొప్ప చదువులన్నీ
రెక్కల కష్టం కొట్టడానికి సరికొత్త వలలు వెదుకుతాయి

సూర్యుడుదయించాల్సిన తెల్లవారుజాము
కష్టజీవి అమాయక ముఖమ్మీద
సారా పొట్లం ఉదయిస్తుంది
రక్తం ఉరకలెత్తి ఆత్మ పులకించాల్సిన శరీరం
సారాయి చెక్కర్లతో బోలుపోతుంది
అలసిన భార్య కనిపించదు
అలమటించే పిల్లలు కనిపించరు
సువిశాల ప్రపంచమంతా కుదించుకుపోయి
సారా పొట్లంలో సాక్షాత్కరిస్తుంది
ఎంత వేటాడినా దొరక్కుండా
ప్రభుత్వం సారాయి సీసాలో తలదాచుకుంటుంది
జీపుల్లో స్వర్గాన్ని తరలించి
గ్రాముల చొప్పున
గ్రామాల్లో దుకాణం పెట్టి అమ్ముతుంది
కాదంటే
పోలీస్ స్టేషన్లో తుపాకులు పట్టి అమ్మిస్తుంది

పని అడక్కుండా తిండి అడక్కుండా
బలవంతంగా నోరు తెరిపించి
ఇంత సారా కుక్కుతుంది
ఒక రాజ్యం గాదు
ఒక హింస గాదు
సారా వాసనల గుభాళింపుల ముందు
ఓటు ఓటిదవుతుంది



కాంట్రాక్టరు వేలి ఉంగరం ముందు
శ్రమ విలువ కోల్పోతుంది
ఒకరోజు గాదు
ఒక అవస్థ గాదు
చీకటి చిత్రవెతల్లో శరీరదీపం ఆర్పుకుపోయింది
చీకటి నల్లగానే కాదు
రంగులు మార్చి తెల్లగా ఎర్రగా ఛామన్చాయగా విస్తరిస్తుంది

జీవితమంటే చీకటికి తలొంచటం కాదు
బట్టకట్టి మౌనంగా మరణించటం కాదు
వెలుక్కోసం వెతుకులాట
ప్రేమకోసం పెనుగులాట
మనిషి కోసం ఎడతెగని గొప్ప తండ్లాట

*10-10-92 మధ్యాహ్నం 1*

## కలలూ జీవితమూ

అప్పటికి కలలెందుకొస్తాయో నాకు తెలియదు
రెక్కల్లేకపోయినా చేతులూపుకుంటూ
గాల్లో ఎగురుతున్నట్టు ఒక కల వొచ్చేది
ఎన్నోసార్లు ఒకే కల వొచ్చేది

ఇసుక కుప్పలో వెతుకుతుంటే
ఒక కొత్త పెన్ను దొరికేది
ఎన్నోసార్లు పెన్నులు దొరికినట్టు కలవొచ్చేది

కొన్నాళ్లకు కలలెంతో ఇష్టమైపోయాయి
కలల కోసం ఎదురు చూడటం అలవాటయింది

ఎవరో ఒక అమ్మాయి
ఎదురుగా కూచుని
గోళ్లు తీస్తున్నట్టు కల వొచ్చేది
ఎన్నోసార్లు అట్లాంటి కలే వొచ్చేది
గుర్తించుదామని ముఖం చూస్తే
ముఖాలు మారిపోయి ఎవరో తెలిసేది కాదు

ఆకుపచ్చ కాగితమ్మీద
అద్భుతమైన వాక్యం రాసినట్టు మంచి కల వొచ్చేది
వాక్యం ఎంత గుర్తు చేసుకున్నా యాదికొచ్చేది కాదు

కలలొచ్చీ వొచ్చీ జీవితానికి కలలెంత అవసరమో తెలిసింది
కలలు కనటం అనివార్యమైపోయింది

జనారణ్యంలో అడుగుల చప్పుడు కాకుండా నడుస్తూ
మిత్రుడూ నేనూ
చలిగాలితో రహస్యంగా మాట్లాడుకున్నట్టు
మరుపురాని కల వొచ్చేది



యుద్ధం చేయటానికి వెళ్లినట్టు
కాల్పులు జరిగి చనిపోయినట్టు బుగులయ్యేది
నా శవయాత్ర జరుగుతున్నట్టు
ఒకటే ఏడుపొచ్చేది
ఇన్నిసార్లు చనిపోయినట్టు
ఒకే కల భయపెడుతుంది
ఎన్నిసార్లు ఛస్తాం

కలలు అలవాటయినంక
భయాలకు భయపడనివ్వవు
ఇప్పటికిక
కలలూ జీవితమూ
కలగలిసి పోయాయి

*1-9-93 సాయంత్రం*

# రెండో అంచు

పువ్వుని ప్రేమిస్తున్నాడని భ్రమపడ్డాం
ఆయన
సువాసనను ప్రేమించాడు
నీటిని ప్రేమిస్తున్నాడని మనసుపడ్డాం
ఆయన
ప్రవాహాన్ని మాత్రమే ఇష్టపడ్డాడు

తోటలో విరబూసి అలరించిన పూలు
తీరా రాలిపడుతున్నప్పుడు
వంకలు పెట్టే ఆలంకారికుల ఛత్రానికి
ఆత్మ వుందంటే నమ్మలేను
ఆయనేమిటో వాళ్లేమిటో
అలమారలో మాగిన అక్షరాల ముసుగు సొగసులేమిటో
తడిసిన భూమిలోంచి
మొలకెత్తే విత్తనాలే చెప్పాలి
ఇవాళ్టికీ
వాళ్ల కత్తికి రెండంచులు
ఇవాళ్టికీ
వాళ్ల రచనకు రెండు భాష్యాలు

పక్షి ఎగురుతున్నప్పుడు
చప్పట్లు కొట్టడం సాహసం కాదు
వేటగాడి దెబ్బ తగిలి
గాయంలోంచి నెత్తురు జిలజిల రాలుతున్నప్పుడు
కట్లు కట్టడం సాహసమవుతుంది
ప్రాణాంతకమైందని పల్లవి మార్చటం
ముమ్మాటికీ చావు సమానం
కాలం రోషాగ్ని కణికల మీద
ఎంత ఉడికినా



కష్టజీవి చెమట
కానివాళ్ల కీర్తి కిరీటమే అయింది
మోసపోయి మోసపోయి
జీవితం మొఖం చిన్నబోయింది

మురిగిన అక్షరాల్ని ఈ చేతుల్తో పెంచలేను
కలల పొత్తిళ్లకింద మొసకొడుతున్న ప్రాణలతను
ఇక ఈ చేతుల్తో తుంచలేను
నాగలి చేతపట్టినప్పట్నుంచి
అవమానాల్ని ఆయాసాల్ని లెక్కచేయకుండా
ఎన్ని కాలాలు దున్నాను
ఎవరి కళ్లజోళ్లు నాకు కొరతవేసినా
చేనులో పచ్చదనమై
గింజలో పలుకునై
ఎన్ని దుఃఖాలు దాటాను
వేల సంవత్సరాల ఒడిలో
ఒంటరినయ్యాను
సమూహమయ్యాను

కష్టమే నా తలమీది తురాయి
నా కవచమూ ఆయుధమూ ఒక్క కష్టమే

ఇవాళ్టికీ
నా యుద్ధం
కత్తితోనే కాదు
శరీరాన్ని బోను చేసి
మనసుమీద మసి పూస్తున్న
నాగరిక సంస్కృతితోనూ

*5-1-94 తెల్లవారుజాము*

# మనిషి పుటక

1

పొడవాటి రాయిచెట్టు
ఎండిపోయిన కొమ్మ కొనల్లో
రెండు ఆకులు పచ్చగా మెరుస్తాయి
పగటిపూట
నీళ్లులేని కొలనులో
నల్ల కలువలు విరబూసి
గాజు గోడలకు వన్నెతెస్తాయి
నలుపూ తెలుపుల్లో
వ్యక్తిత్వాలు ఒక్కొక్క మెట్టు దిగుతుంటాయి
మనిషి జీవితానికి అంత నిర్దయ పనికిరాదు

2

హాజర్ హై
మల్లేశం హాజర్‌హై
ఆర్థిక నేరస్తుల క్యూ
క్షణక్షణానికి భూకంప మృతుల్లా
పెరుగుతుంది
యాదగిరి హాజర్‌హై
పాపం ముసలి గుమాస్తా నోరు
ఎంతరిచినా ఎండిపోదు

దొంగతనం చేశావా
లేదు
ఓట్ల దొంగతనం చేయలేదు
ఫైళ్లు మార్చలే
సారా అమ్మలే
దొంగ బిల్లులెత్తలే
దొంగ నోట్లు అచ్చు వేయలే



పిల్లల కోసం తిండి దొంగతనం చేశాను

కళ్లద్దాల కవతల
నిజాయితీకి తెర దిగుతుంది
మనువర్తి కోసం
ఒంటరి పక్షులు ఆపసోపాలు పడుతాయి
విజయా హాజర్‌హై
ముసుగు కదిలినా
బురఖా కదిలినా
భూమి వొణుకుతుంది
విజయా విజయా
సంసారంలోని దెబ్బలన్నీ
కంటినుండి రాలి కరుడుగడుతాయి
కారులోంచి దిగిన పాదాలకు
మట్టి ఏమాత్రం అంటదు
జీవితంలో
మరీ అంత నిర్దయయితే
అసలు మనిషేనా?

3

నిరీక్షణ
రెటినా అలిసిపోయి
రెప్ప వాల్చినపుడు
ఎవరి కోసం నిరీక్షణ
ప్రియురాలి కోసం కాదు
మంత్రి కనుసన్నల కోసమూ కాదు
మరెవరి కోసం

........ ........ ........

4

ఎనిమిది ఖాకీ నేత్రాలు
తుపాకులు ఎక్కుపెట్టి కడక్‌గా నడుస్తుంటాయి
నడుమ రెండు కంఠాలు నిర్భయంగా
నినదిస్తాయి

తలలకు వెలకట్టే
ప్రభుత్వాలు నశించాలి నశించాలి

చెరొక చేయి సంకెళ్లతో చిక్కుపడి వున్నా
రెండు పిడికిళ్లెత్తి నిలదీస్తాయి
ఉరుముకు జడుపుంటదా
జీవనదికి అడ్డుంటదా
మట్టికి చావుంటదా
రాకాసి రాజ్యం
మనిషి మరో మనిషితో
ప్రేమగా మాట్లాడుకోవటానికి వీల్లేదు
గాఢంగా ఆలింగనం చేసుకోనివ్వదు
దుఃఖపు కళ్లతో మాట్లాడుకోవటం
మనకే చాతనవుతుంది
శబ్ద సంచయంతో
జనం గుమిగూడి
వెనకాలే నడుస్తారు

జీవితంలో
ఇంత దయా
ఇంత ప్రేమా
ఇంత ధైర్యమూ
లేకపోతే
అది మనిషి పుటకేనా

*29-9-93 సాయంత్రం*



# కనుపాప

1

అక్షరాలకు ఊరడించటమే కాదు
ఉడికించటం వొచ్చునా
మనసు ఉగ్గబట్టుకుని ఉగ్గబట్టుకుని
ఊపిరి ఆగినట్లవుతుంది
శరీరంలోంచి వేడినంతా లాగేసి
హిమశకలాల మీద పార్లించినా అంత బాధుండదు
నా. కనుపాపల్ని పెరికేసి
నా కళ్లముందే పెట్టి
కవిత్వం రాసుకొమ్మనే వాళ్లముందు
ప్రస్తుతం ఓడిపోయాను

ప్రాతఃకాలం పాడుసమయం
పత్రిక చదవటమే దోషమయింది
సన్నిహితుడి మరణాన్ని పొట్లం కట్టుకొచ్చి
గర్వంగా నాముందువిప్పింది
వాక్యాలన్నీ నెత్తుటిచారికలై అలుక్కుపోయి ఆత్రపెడతాయి
అయ్యో అయ్యో
అక్షరాలకు ఉడికించటమే కాదు
ప్రాణాలి మెలిపెట్టడం వచ్చును

2

గోరింకా గోరింకా
హఠాత్తుగా నువ్వెటు మాయమయ్యావు
కవిత్వ రెక్కలతో కమనీయంగా ఎగిరేదానివి
ఎట్నుంచొచ్చావో వొచ్చావు
మా కుటీరానికి తోటలా వొచ్చావు
మా చెలకలకు వానకాలమై వొచ్చావు
మా చూపుల మధ్య వాగుకాలవై సంచరించావు

వొచ్చినట్లే వొచ్చి
వొరి అన్నమై మా శరీరంలో కల్సిపోయావు
నువ్ మాయమైతే మేమేం కావాలి

నువ్ బాట నడుస్తుంటే ముండ్లు పక్కకు తప్పుకునేయి
నవ్వితే మొక్కలన్నీ ఒక్కసారి పూలు పూసేయి
మాట్లాడితే ముసలోళ్లకి ప్రాణం లేసొచ్చేది
మనోవల్మీకం లోంచి చీమలు దారులు పట్టేయి
చెరువులో గుడ్డి కొంగలు తపతపా కొట్టుకుంటూ పైకెగసేవి
కనక రాజా
నువ్ చెయిపెట్టి దేవితే కుండలో అన్నం పుట్టేది
మా అన్నం మాయమైతే ఎట్లా నిలిచేది?

3

జ్ఞానాన్ని తలకలంకరించుకుంటున్న దశలో
ప్రపంచ మానవుడి దుఃఖధ్వని ఆలకించావు
స్వప్నాలు రూపుదిద్ది సజల సంకేతాలకంకితమయ్యావు
దృశ్యం స్పష్టం చేశావు
యుద్ధం నిజం చేశావు
అక్షరాల్ని సృష్టించటమొకటేనా
సృష్టికి ఆలంబనమైన చలచ్చలన జ్వలనంలో
చేయికలిపిన నిర్నిద్రుడా సముద్రుడా
కడచూపు మిగల్చకుండా ఎడబాపిన
కర్కోటకుడెవ్వడు?

జీవితమంతా శిలువైనప్పుడు
శిలలు తప్ప కలలేవీ దొరకనప్పుడు
జనం కళ్లల్లో జవం జీవం నింపిన స్నేహితుడా
నిన్ను మాక్కాకుండా చేయటానికి
వంచకునికయినా మనసెలా వొప్పింది
కనీసం నీ ముఖం మాక్కాకుండా చెక్కేయటానికి
హింసావిధ్వంసులకయినా చేతులెట్లొచ్చాయి



కలిసి నడవటానికి సాగిన కాళ్లు ఆగి పరితపిస్తున్నాయి
అన్నం వడ్డించిన పళ్లెం నీ ఆకలి కోసం అల్లాడుతున్నది
షెల్ఫులో పుస్తకాలు నీ వెతుకులాట వేళ్ల స్పర్శ కోసం చిన్నవొయినాయి
నాలుగు జీవాక్షరాలు రాస్తావని చూసిన కాయితాలు తెల్లవొయినాయి
పెద్దపులిని ఉత్తరించటానికి సిద్ధమయిన ఆయుధం
భుజం కోసం కలవర పడుతుంది
సముద్రుడా సముద్రుడా నువ్వెక్కడ
సముద్రాల్ని పోటెత్తించిన కరచాలనాలెక్కడ
సింహాసనాధీశుల చివరి నిమిషాలు గణించిన సాహస పద ధ్వనులేవి

గుండెల్లో కవితలు చిలికినవాడా
గుండెలు విప్పారినప్పుడు
పాటను ఉరితీసిన వాడిని అదేపదచిత్రం వేటాడుతుంది
భూమిలో కనుపాపలు నాటినవాడా
భూమి వనమయూరమై ఉరకలెత్తినపుడు
తలకు వెలకట్టి దేశాన్ని తాకట్టు పెట్టినవాడికి
వెలకట్టటానికి
వేలవేల చేతులొస్తాయి

*369-92 ఉదయం 11 గం॥*

# అపాత్రదానం

ఊయలెవరు కట్టారో తెలియక
ఉడుత వొచ్చి ఊగుతుంది
కొలనులో తేలియాడుతున్న
కొత్త శిబిరం ఎవరిదో గుర్తించక
తుమ్మెద అడుగు పెడుతుంది
చల్లని జాలివానచూపుల్తో
సింహాలు చేరదీస్తాయి
గోళ్లు లేని నునుపైన చేతుల్తో నిముర్తాయి
ఎగిరే
లేత కపోత రక్తం కావాలని
మర్యాదస్తులు ఎరవేస్తారు

ఎదలు ఛిద్రమైనా
ఎరలు అర్థం కావు

అడవిసింహాల అసలు సింహాల అంతం చూసి
నగరసింహాలు నాజూకు తేలాయి
పగలు మనుషులై
సాయంత్రాలు సింహాలై
రూపాయి కీనీడలో యథేచ్ఛగా సంచరిస్తాయి
నిజానికి చిగురాకులవేళ సింహాలెక్కడివి
రక్తం తాగితేనే కదా
అవి సింహాలైంది

పొలాల నుంచి ఊర్లనుంచి
ఎడ్లబండ్ల మీంచి
బస్తాల్లోంచి బస్తీలకు
ప్రవహించేది రక్తం కాదా
మనిషి ఆరుగాలం రక్తమోడ్చే చెలిమె కాదా
మాటల బెలూన్లు పట్టుకొని



ఎగిరే దారపు ఉండకాదా
మళ్లా ఇప్పుడు మోసపొయ్యేది
మనిషి త్యాగ గుణమేనా?
పరిశుద్ధమైన వేడినెత్తురు నింపితేగాని
కారు నడువదా

రక్తదాన వర్ణాక్షరాలతో
రాజకీయ శిబిరాలు
ఊరిమీద పడతాయి
చెట్లమీద నువ్వాలికిస్తున్న రక్తం చాలదా
కర్ఫ్యూ ముద్రలో కమిలిన జీవితం చాలదా
చదువుల సాంబ్రాణీ పొగలో పొగచూరిన పేగులు చాలవా
సినీమార్చురీలో వేలాడుతున్న పసిడి స్వప్నాలు చాలవా
ఎంత రక్తం కావాలి మీకు?
దయలేని స్ట్రాలతో
మనిషిని ఎంతకాలం పీలుస్తారు

మీ కాళ్లకింద భూమి రక్తంతో తడిసిపోయింది
త్యాగం విలువ తెలియనివాళ్లకు
వీరభూమి పండుతుందని తెలియదు
భూమ్మీద పండే
వీరుని చిరునవ్వే
సింహాలకు శిక్షాస్మృతి లిఖిస్తుంది

*24-11-93 సాయంత్రం*

# అసమయం

దొరలి వస్తున్న
రాయి నుంచి
తప్పుకోవటానికి సమయముండదు
విరిగి పడుతున్న
వంతెన మీద నిల్చుని
వివేచించడానికి వీలుపడదు

పట్టాల మీద
అడ్డంగా పడుకున్న
సున్నిత మనస్కుడు ఏం కలలు కనగలడు
రైలొచ్చేదాకా నిద్రే పట్టదు
నిశ్శబ్దంగా
తెలివి కాకుండా
సముద్రంలో ఐనా సర్రున జారే
కంప్యూటర్ రెక్కల చప్పుడు
కుత్తుకమీద కూచున్నప్పుడు
ఎవరికయినా ఏం కలలు వొస్తాయి

చాకిరీ చేసే చేతుల్ని నరికితే
ఆశ్చర్యం
రక్తంచుక్క కూడా రానేరాదు

దుకాణం పెట్టుకుని
కూచున్న తర్వాత
అమ్ముకోవడమే తరువాయి
దరల పట్టికలో
శరీరంలోని అన్ని భాగాలకూ
రేట్లుంటాయి
స్పందన తెగని
ప్రేమ పెకలించనివ్వని



మనసుకు మాత్రం ధర పలుకదు
కళ్లెదుటనే
మనిషిని కాల్చి చంపినా
కన్నీళ్లు రానే రావు
వొస్తే అదే ఆఖరు

అనుభవాలు బతకనపుడు
కలల చెలిమె పూడినపుడు
కన్నీళ్లు ఆవిరైనపుడు
అది లోకమెట్లా?
వాటిని బతికించుకోవటానికి
చావకపోతే
మనిషిది బతుకెట్లా?

*1-12-93 నడిరాత్రి*

# సంసారం

పాటల సడికి
పులకించిన దుమ్ము
అప్యాయంగా పాదాలకు అల్లుకుంటుంది
ఎన్నో నాగరికతలు పండించిన
గరుకైన చేతులు అమాయకంగా నవ్వుతుంటాయి
నుదుటిమీద ఉదయించిన పొద్దు
చెమట నదిలో కరిగి నీరవుతుంది

మోకాళ్ల మీదికి గోచి
మడతపెట్టి రొంటికి చెక్కిన కొంగు
పాలిండ్లమీద ముడేసిన రైక
నెత్తిమీద గడ్డిమోపు
ఎదురొచ్చే చిరుగాళ్లను మందలిస్తున్న కాలిమట్టెలు
ఆమె ముఖం తిప్పితే
గాలికి ఊగుతున్న వరిచేను
తొంగి తొంగి చూస్తుంది
ఆమె వాస్తుంటే
జొన్నకర్రలు శిరసొంచి ఆహ్వానిస్తాయి
ఆమె చేతిలో
కొడవలి కూనిరాగాలు తీస్తుంది
గర్వంతో పేడకూడా
తలమీదెక్కి కూచుంటుంది
ఎందుకో జీవితం ఆమెను చూడగానే
ముక్కిరిసి పెదవ్విరుస్తుంది
కొం పక్కట్టుకున్న సుఖాలు
ఎవరో ఒకరు విప్పుకపోతారు
అవేమీ ఆమె పట్టించుకోదు
కాలాలు చూసినట్టే కష్టాలు చూసింది
కాలువలు దాటినట్టే గండాలు దాటింది



కంటిముందు కట్టెల పొయ్యి
శరీరం ముందు సంసారం
ఒకటే తీరుగ తిప్పల పెడతాయి

పొగకు కండ్లు అలవాటయిపోయాయి
సంసారానికి శరీరం అలవాటయిపోయింది
పాలియ్యటం లాలపొయ్యటం తినిపించటం పడుకోబెట్టటం
పిల్లల కోసం
చావకుండా బతకడం అలవాటయింది
వాకిలూడ్వటం వంట చెయ్యడం
నాట్లేసి కలుపుదీసి కోతగోసి పడుగుతీసి
అలసి అలసి అలసటే విశ్రాంతయినట్టు
బతకడం కోసం కష్టం అలవాటయింది
బతుకు పొడుగునా కన్నీళ్లు అలవాటయినయ్
సంసారం పొడుగునా నొప్పులు అలవాటయినయ్
దెబ్బలు లేసినప్పుడల్లా
ఉడుకన్నం మసిగుడ్డలో పెట్టి
కాపడం ఒక ఉపశమనమైంది
గోడలకు చెవులుంటాయి గనక
ఎవరితోనూ గోడు చెప్పుకోలేదు

జీవితంలో పిడకలకన్నా ఆశలేమున్నాయి
సంసారంలో పిల్లలకన్నా భ్రమలేమున్నాయి
ఖరీదైన కన్నీళ్లయినా కాదాయె
కవులు సానుభూతి ఒలికించటానికి
చారెడు సదువన్నా రాదాయె
సంతసంఘాలు పెట్టుకోటానికి

చాట్లో బియ్యం పోసుకొని
ఎంత వలపోస్తే ఏం లాభం?
పొయ్యి అంటించకా తప్పదు
బియ్యం ఎక్కించకా తప్పదు

12-1-94 సాయంత్రం

# కన్నీటి స్నానం

అంత సుతారం కాదు
పూలతోట ఎవరు పెంచుకున్నారో
తెలుసుకోవటం అంత సుతారమేమీ కాదు
శాపాలతో కమిలిపోయిన శరీరం
సౌందర్యోపాసకులకు అర్థం కాదు

తొక్కుడు బిళ్ల ఆడేనాడు తాననుకోలేదు
తానే తొక్కుడుబిళ్ల అవుతుందని -
కలలు కనాలని కూడా తెలియని వయసులో
కన్నీటి స్నానం చేయించటం దుర్భరమే

ఊచకోత అయినా సరిపోయేది
మనసుకోత
అనుక్షణం పూలు కాకుండానే
మొగ్గలు రాలిపడతాయి

గోదావరిలో కాళ్లు కడుక్కుంటున్నప్పుడు
ఆమెకి తెలువదు
తన కాళ్లకిందే
పెద్ద గోదావరి దాగివుందని
చదువుతున్న పుస్తకం
బలవంతంగా మూసేసి
పసుపూ కుంకుమా రాశారు
మేకా పులీ ఆట ఎందుకాడుతారో తెలువని వయసులో
మేనరికం 'మేనా'లో ఊరేగించారు
బాసికాలు ఎందుక్కడుతారో అర్థం కాలేదు గాని
కనుచూపు కడ్డంగా
చీకటి నింపారు
కలలు కనాలని తెలియని శరీరానికి



కన్నీటి స్నానం చేయించటం
దుర్భరం దుర్భరం

ఆమె కన్నీళ్లు తుడవటానికి చీకటే చేతులు చాచింది
వీపుమీదా ముఖంమీదా
రాకాసిగాయాలు
శాపాలతో శాసనాలతో
కమిలిన శరీరం
విషాద చిత్రశాల అయ్యింది
చీకట్లో మెరసిన మెరుపులో రెక్కలు విదిల్చింది
ఉషఃకాంతిలో కలిసింది
గోదావరిలో ప్రతిఫలించిన కాంతిలో లీనమైంది
చదివింది చదివింది
ఒంటికాలు మీద నిలబడి తపం పట్టింది
కనురెప్పల మీద మంచుగిన్నెలు వొంపింది
చెక్కిళ్లమీద మకరికా పత్రాలు దిద్దుకుంది
మకరికా పత్రాలు దిద్దుకునేటప్పుడు
అంతా కావ్య దృష్టే -
మాయా మర్మం తెలువదు
మకరం పట్టు అసలే తెలువదు

మొసలి కన్నీరు ఆత్మీయమై అడుగేసింది
మాటల తూగుటుయ్యాలలో తేలిపోయింది
మొదటిసారి కలలు కనాలన్పించి కళ్లు మూసుకుంది
ప్రపంచం విప్పినట్టే విప్పి
మమకార విపంచి మీటినట్టే మీటి
వాడు స్వప్నభంగంలో తేలాడు
బంగారు ముసుగేసుకున్న కుక్కబుద్ధుల వాడు
కూడలిలో ఎదురై కూనిరాగాలు తీస్తాడు

రెండు ముఖాల మనిషినే లోకం గౌరవిస్తుంది
లోకంలో రంగులు

ఆమెకు అందుతున్నాయి
గోదావరి ఎందుకట్లా ఉధృతమవుతుందో
ఉద్రేక పడుతుందో ఊహకందింది
ఆమె ఇప్పుడు
తన కలల గురించి జీవించటం లేదు
ఎవరి కలలు ఎందుకు చెదిరిపోతున్నాయో
ఎవరి తలరాతలు ఎవరెట్లా తారుమారు చేస్తున్నారో
ఎవరి బతుకెందుకు ఛిద్రమవుతుందో
ఆలోచిస్తోంది

సమయమొచ్చినపుడు
కుక్కబుద్ధికి
బుద్ధిచెప్పే తీరుతుంది

*5-2-94 నడిరాత్రి*



# విభజన రేఖ

ఇసుక తిన్నెలమీద వెన్నెలేదీ
పూలకాడల మీద పువ్వులేవీ
చిన్ని పెదవుల మీద చిరునవ్వులేవీ

★

మనిషి నుదుటిమీద విభజనరేఖ ఉదయిస్తుంది
చివరకు 'ప్రేమ' పనికిరాని పదమై పోతుంది
కలల సౌధాలు కూల్చటానికి
గొలుసులు గునపాలు ధరించి
యధేచ్ఛగా సంచరిస్తున్న
ముళ్లపందుల్ని చూశారా....
ముళ్లపందిని ఒకసారి ఆలింగనం చేసుకుంటే చాలు
మన ఒంటినిండా ముళ్లే మొలుస్తాయి

ప్రాణం అంగట్లో అన్నిటికన్నా చవకయిపోతుంది
మార్కెట్ మాయా ప్రపంచంలో
లాభమొక్కటే నిజం
అనుబంధాలు ఆత్మీయతలు మానవ సంబంధాలు
మాయ ఉచ్చులో గిజగిజలాడుతున్నాయి
రాజకీయ మాయాజూదంలో
ఓటొక్కటే నిజం
జయంతులూ వర్ధంతులూ స్వతంత్ర దినాలు స్వర్ణోత్సవాలు
ఆత్మగౌరవాలు దేశ గౌరవాలు
అన్నీ మోక్షసాధనాలే
విలువల మీద విషాదం తెరలు తెరలుగా విస్తరిస్తుంది
మరిగిస్తే మరిగి
చల్లార్చితే చల్లారి
హృదయం పరాధీనమవుతుంది
మనిషి వ్యక్తిత్వం కోల్పోయి

ఎడారి ఇసుకలా మెరుస్తుంటాడు
దేశంలో కోట్లాది ప్రజలు మనుషులుగా కనబడరు
. ఓటర్లుగానే కనిపిస్తారు
అధికార దాహం
ఓటర్ల మధ్య విభజనరేఖ కోసం
కోటి తంటాలు పడుతుంది

ఇంతకుముందు
దేవుడు కేవలం మోక్షసాధనమే
పవిత్ర ప్రజాస్వామ్యంలో ఓట్ల సాధనమయ్యాడు

రాజకీయ మంత్రదండం ముందు
విలువలన్నీ వొళ్ళిపోతాయి
రంగస్థల నాటకాలు దెబ్బతిని
ఓట్ల నాటకం రక్తి కడుతుంది
ఓటరుకు మూకాభినయం తప్ప మాటలుండవు
మాటలు నేర్చి మనిషి అవుతున్నప్పుడు
తుపాకీ పేలుతుంది
రక్తం ఒలికిన నేలమీద రాజీ కుదరదు
రాజీలేని ఒక సాము మొదలయింది
మనిషి కోసం
మనిషితనం కోసం

జూన్ 1993



## స్వయం హననం

అర్ధరాత్రి ఎవరికి ఎవరూ అర్థం కారు
అర్ధరాత్రి ఎవరి సంతోషాన్నీ కాదనలేను
జీవితం నిండా అర్థంకాని చీకటి నిండినప్పుడు
అర్ధరాత్రి మెలకువగా ఉండి దేన్ని ఆహ్వానించాలి?
గడిచినరాత్రి మోసుకెళ్లిందీ చీకటే
గడపాల్సిన రాత్రి మోసుకొచ్చేదీ చీకటే అని తెల్సినపుడు
ఏ పండుగయినా ఎందుకు చేసుకోవాలో తెలియదు

నిన్నటిదాకా నేనొక మనిషిననే అనుకున్నాను
నిన్నటిదాకా నాకొక హృదయముందనే అనుకున్నాను
అనుభవాల కొలనులోంచి పొంచిచూసే తమ్మిపూలూ
బతుకు పుస్తకంలో రెపరెపలాడుతున్న బంగారు వాక్యలయలూ
వరుసలూ దరువులూ వనమయూరాలు
శిశిరాలు వసంతాలు చిరుగాలి సరాగాలు
నిన్నటిదాకా నాకూ ఒక భవిష్యత్తుందనే కలగన్నాను
చీకటి చిరిగిపోయి
చిగురాకు దోనెల్లోంచి చిట్టి సూర్యుని కిరణాలు
అల్లుకుంటాయనే ఊహించాను

మిట్టమధ్యాహ్నం వేళ
సూర్యుడు నిండుగా నిలబడి వెలుగుతున్నప్పుడు
కర్మసాక్షి సాక్షిగా
ఇంత నల్లటి చీకటి కబళిస్తుందనుకోలేదు
మధ్యయుగాల చీకట్లో
నాలోని మనిషి మాయమయ్యాడు
నా కనుల తేజస్సు కొడిగట్టి ఆరిపోయింది
ఆప్యాయతతో పులకించే నా చేతులకిప్పుడు
కావలింతలోని మాధుర్యం రుచించటంలేదు
తడితడి నవ్వుల్తో తరగలెత్తె నా పెదవులకిప్పుడు

ముద్దులోని మమకారం రుచించటం లేదు
'నేను మనిషినేనా' అని నాకిప్పుడు అనుమానంగా ఉంది

కత్తులూ కఠార్లూ
కొత్తగా మొలిచిన కొమ్ములూ కోరలూ
త్రిశూలాలు రక్తతిలకాలు
పులి నాలుకమీద పూలపూజలూ
నిండుచూలాలు కడుపుమీద
విషపు ముళ్లలా
దేశమంతా చాచిన వెర్రిపడగనైనాను
నేను మీకెవరికీ అర్థంకాను
నాకు మీరెవరూ అర్థంకారు
నా కదలికలన్నీ రిమోట్ కంట్రోల్ ద్వారా నియంత్రించబడతాయి
మనిషిగా పుట్టిన భూతాన్ని యంత్రాన్ని
యంత్రభూతాన్ని
దాహంతో రగిలే దావానలాన్ని

నేనింకా మనిషినేనా అని నా అనుమానం
నాలోని మనిషి నాకే కనబడటం లేదు

ఈ చేతుల్తో పూలచెట్లు పెంచాను
ఇవే చేతుల్తో అపురూప శిల్పాలు చెక్కాను
ఈ చేతుల్తోనే నా తమ్ముడికి వెచ్చవెచ్చని గోరుముద్దలు తినిపించాను
ఇవే ఇవే చేతుల్తో అక్షరాలు పేర్చి కవితలల్లి
ఇల్లలికినట్టు ప్రపంచమంతా అలికి ముగ్గు పెట్టినవాన్ని
ఈ చేతుల్ని చూస్తే నాకెంత ముద్దొచ్చేదో
నా చేతుల్ని చూస్తే నాకెంత గర్వంగా అన్పించేదో
ఇవాళేమిటి?
ఈ పగటి చీకట్లో
నా చేతులింత పరాయిగా కనబడుతున్నాయీ
చేతులింత రాక్షసంగా
భయంకరంగా అమానుషంగా కనబడుతున్నాయీ



నాలోని మనిషిని గొంతుపిసికి చంపటానికి
నా చేతులే కరసేవ చేశాయి
నా జీవన వేణువూదే మధుర చరిత్రను
డైనమైట్లతో పేల్చివేశాయి

ఈ పెదవులతో ఎన్ని మాటలు నేర్చానో ....
ఎందర్ని మనుషులుగా మహోన్నతులుగా తీర్చిదిద్దానో....
ఈ పెదవులు నాకెన్ని రుచులు చూపించాయో....
ఈ పెదవులంటే నేనెంత పడిచచ్చేవాణ్ణి
ఈ పెదవులే ఇవ్వాళ నా హృదయాన్ని చీల్చుతున్నాయి
ఈ పెదవులే నా మాటల వ్యవస్థను సాంతం అవమానించాయి
ఇన్నాళ్లూ నేను పాడిన పాటల్ని క్రూరంగా చప్పరించాయి
సమస్త మానవ నాగరిక సంస్కార లిపి మీద ఇవ్వాళ
తుపుక్కున ఉమ్మేశాయి

నేను మనిషిని కాను
నేను భూతాన్నీ యంత్రాన్నీ కాను
చీకటిని కాను వెలుగును కాను
నేనెవర్నో తెల్సుకోవటానికే అర్ధరాత్రి బయల్దేరాను
నా మనిషి నెక్కడ జారవిడుచుకున్నానో అన్వేషించటానికే బయల్దేరాను
నా పాటను నేనెక్కడ పగులగొట్టుకున్నానో
అక్కడ కొత్తపాట కట్టుకుందామనే బయల్దేరాను
నా రక్తం ఒలకబోసుకున్న చేత్తోనే
రక్తం పార్లే మనిషిని నిలబెడతాను

*31-12-92 నడిరాత్రి*

# నదులు ఒకేలా పారవు

ఔన్నత్యం గురించి మాట్లాడుతారు గాని
అరచేతి రేఖలు మీరు
ఔన్నత్యం గురించి మాట్లాడుతారు గాని
ఆకాశాన్ని విరిచి వేసుకున్న
ఆసనం వదిలిందేది?
వాళ్ల మనసు గురించి అనబోతారు గానీండి
కడగంటితో నైనా తడమటానికి
అంటు 'మడి' విడిచిందేది?

జీవితం కోసం
నక్షత్రాల్ని తెంపి
వేలి గీతల మధ్య అలంకరించుకున్న ఔన్నత్యం మీది
లోకం కోసం
జీవితాల్ని తెంపి
నక్షత్రాల్ని వెలిగించిన అల్పత్వం వాళ్లది
పాదాల నుంచి పుట్టి
పాదాల కింద నలిగినవాళ్లు
నరాలు చిట్లి అనుభవాలు పొంగినపుడు
వాళ్ల నెమలి గొంతెత్తి
ఒక్కపాట పాడితే మీ హృదయానికెంత కంపరం?

మట్టి రేణువుల మధ్య పార్లి
చెట్లతో చేన్లతో మమకారం పంచుకున్నందుకు
వాళ్లకన్నీ మట్టిగుణాలూ చెట్టుగుణాలే వొచ్చాయి
అణకువొచ్చింది గానీ
ఔన్నత్యమే రాలేదు
చెట్టు శరీరానికి మట్టుండవొచ్చు
పూసే పూలకు కాసే కాయలకేది?
శరీరపు మైలను కడుక్కోవచ్చు



లోపల మనసులో మైలెంతో
ఊబెంతో ఎట్లా గుణించేది?
కండరాలు కంకరచేసి
కాళ్లకింది దారి అయినారు
లోతైన మీ ఇంటి చేదబావులు
మీరు పరవశించే ఎత్తైన చారిత్రక కట్టడాలు
స్నానఘట్టాలు వాళ్ల సాహసాలే
మీ భుజాల మీద వొయారంగా
రెపరెపలాడుతున్న శాలువాలు వాళ్ల కలలే
ముండ్లిరగకుండా రాళ్లొత్తకుండా
పాదరక్షలకు చర్మం కుట్టింది వాళ్ల దయే
అంతెందుకు
సంకల్పానికీ పవిత్రతకూ సంకేతంగా మీరు ధరించిన
యజ్ఞోపవీతం ఎవరిశ్రమ?
మిమ్మల్నీ మీ రాజుల్నీ రాణుల్నీ
మీ కోట్లాది దేవుళ్లనీ
మోసి కాయలు గాసిన 'మేనా'లు వాళ్లు
మీకు యజ్ఞకుండమెంత గొప్పో
వాళ్లకు నాగలికర్రు అంత గొప్ప
ప్రపంచం తెలవకుండా తెలివిగా గంతలు కట్టి
అడుగు పొరల్లోకి తొక్కారు
వాళ్లకు మీ ఔన్నత్యమెలా సిద్ధిస్తుంది?
బొటమనేలు నుంచి బొమ్మల పెళ్లిళ్లదాకా
ఎవర్నయినా ఎప్పుడు పెరగనిచ్చారు గనుక
కూడబలుక్కొని వాళ్లు మాట్లాడితే
ఎగతాళి చేయాలనే -
ఇప్పటికీ ఎంతహంకారమండీ
ఇంకా తొక్కాలనే -
పాండిత్యంతో పనిని న్యూనపర్చాలనే -

ప్రవాహప్పక్షుల త్యాగ మాధుర్యాలు చూసి
శరదృతు పవనాల సంభాషణలు విని
లోయలు. శిరసెత్తితే
పురివిప్పితే
ఇంకా తూణీరాల తొక్కులాటేనా.....
ఆర్యదేవా!
అన్ని రుతువుల్లో నదులు ఒకేలా పారవు
వాళ్లు ఎదగటం మొదలైందిప్పుడే
మీ ఔన్నత్యాలు జాగ్రత్త
మీ సంస్కారాలు మరింత జాగ్రత్త

*19-3-92 మధ్యాహ్నం*



## వాంగ్మూలం

దేవునిమీద ప్రమాణం చేసి
అంతా నిజమే చెబుతాను
దేశ నాయకుల చిత్రపటాల ఎదుట
క్రూరంగా వికృతంగా
నన్ను హింసించి హింసించి చంపారు
అమ్మలాలా
నా గోస ఏదేవునికీ ముట్టలేదు
నా ఏడుపు ఏ నాయకునికీ ముట్టలేదు
ఏ దేశభక్తునికీ ముట్టలేదు
అమ్మలాలా నన్ను నమ్మండి
నా తల్లిమీద ప్రమాణం చేసి నిజమే చెబుతాను
అందర్లాగే నేనూ ఆడపుటక పుట్టాను
కమ్యూనిస్టుల గుండెకాయలో
సర్వోదయ నేతల చల్లటి నేలమీద పుట్టాను
అమ్మ కడుపున శాపమై పుట్టాను
నాయిన ప్రేమలో చిగురించలేదు
అప్పుడే వండివార్చిన
అన్నం లాంటి అమ్మ ప్రేమలో పెరిగాను
అప్పుల్లో ఆయసాల్లో
బరువైన బతుకులో నేనో బరువై పెరిగాను
జొన్న కంకుల్తో ఆడుతూనే
జొన్నసేను కొయ్యబొయ్యాను
కడుపు కట్టుకుని
అమ్మతో కైకిల్లకెళ్లాను
మా అమ్మ గానీ నేనుగానీ
ఊళ్లో ఉన్నామో లేమో అన్నట్లున్నాం

ఎవరి జోలికీ పోలేదు
ఎవరి సొమ్ముకూ ఆశపల్లేదు

నడిరాత్రి అమ్మ ఒక్కతే
ఏడుస్తూ కూచుంటే ఎందుకో అర్థమయ్యేది కాదు
అడిగేంత సాహసం చెయ్యలేదు
అమ్మతోపాటు నేనూ ఏడ్చేదాన్ని
తెల్లబట్టలోడు ఏం మాట్లాడేవాడో
తెలిసేదికాదు
తెల్లమొగం వేసుకొని అమ్మరంది పడితే
అంతా దేవినట్లయ్యేది
నన్ను ప్రేమ జెయ్యాలని అమ్మ తండ్లాడేది
అమ్మ కన్నీళ్లు తుడవటానికి చేతులు వణికేవి
అడగటానికి మాటలు వణికేవి
వొణుకుతున్న చేతుల్తో కన్నీళ్లు తుడవలేకపోయాను

అమ్మలాలా
అంతా నిజం చెబుతున్నాను
ఏదీ దాచుకోకుండా జరిగినదంతా చెబుతున్నాను
ఆనాడు చీకటి చిటుకుమన్నప్పుడు
మాయింటికి ఒకాయన వొచ్చాడు
సగం చందమామ వెలుగుతుంటే
'అమ్మా' అని పిలిచాడు
చెయ్యెత్తి అమ్మ కన్నీళ్లు తుడిచాడు
అమ్మ ముఖంలో
ఐదేళ్ల తర్వాత ఆనాడే నవ్వుచూశాను
ఏండుగా నేను నవ్వింది ఆనాడే
నన్ను 'చెల్లే' అని పిలుస్తుంటే
కళ్లు చెమ్మగిలినాయి
ఎంతో ప్రేమగా తిరుగుతుంటే
ఇల్లంతా సంబూరమయింది



అమ్మ అన్నం వండింది
ముగ్గురం కలిసి ముచ్చట్లాడుకుంటూ
కడుపునిండా తిన్నాం
మల్లొస్తానని అతను వెళుతున్నప్పుడు
'అన్న' వెళుతున్నట్టే ఎల్లిపడ్డాం
అమ్మా
అదొక్కటే మేం చేసిన తప్పు
మమ్మల్ని ఆప్యాయంగా పలకరించినవాళ్లకు
అన్నం పెట్టడమే నేరమైంది
అంతకంటే ఎవరి జోలీ తియ్యలేదు
ఎవరి సొమ్మూ తినలేదు

రెండ్రోజుల తర్వాత పోలీసులొచ్చారు
బండబూతులు తిడుతూ లాఠీల్తో బాదారు
స్టేషనుకు గుంజుకపొయ్యి లోపలేశారు
నలుగురు నల్లటి యములొచ్చారు
మా అమ్మను కట్టేసి
లాఠీలు విరిగేదాకా కొట్టారు
బూతులకయితే అర్థంలేదు
నోర్లు పాడుగాను
నోటినిండా బూతులే
వాళ్ల తల్లి లాంటి తల్లిని
నా కన్నతల్లిని నాముందే హింసించారు
నా బట్టలిప్పేసి
చెప్పరాని పద్ధతుల్లో నన్ను చెరిచారు
యముల్ని చూడలేదు
రావణాసురుల్ని చూడలేదు
మనుషులేనా వాళ్లు?
నా బతుకు అన్యాయమైపోయింది

అమ్మలాలా
ఆరోజే నా శవం తగలబడిపోయింది
మా అమ్మ దుఃఖం మంటల్లో సుడిదిరుగుతుంది
అమ్మ లాలా నానలాలా
నాకు కోర్టులమీద నమ్మకం లేదు
నాయకుల మీద న్యాయమూర్తులమీదా నమ్మకం లేదు
మీమీదే నమ్మకం
అమ్మ కన్నీళ్ల నేనెలాగూ తుడవలేను
మీరే ఆ కన్నతల్లి కన్నీళ్ల తుడవండి

*22-9-93 సాయంత్రం*



## వ్యత్యాసం

చలికాలానికీ
చలికాలానికీ
తేడా వుంటుంది
తలుపులూ కిటికీలూ వాల్చి
ఇళ్లు ముడుచుకుంటాయి
రగ్గులకింద రక్తాన్ని ఒడిచుట్టి
స్వెట్టర్లు వెచ్చనవుతాయి
గుడిసెల ముందట
మంట వేసుకుని చేతులు కాపుకుంటూ
ముచ్చట్లు మెరుస్తాయి
జివ్వున లాగే చలి దాడిలో
మంటను మించిన ముచ్చటేముంటుంది?

నిశ్శబ్దానికీ
నిశ్శబ్దానికీ
ఎంత తేడా
కళ్లూ నోరూ మూసుకొని
చేతులు కట్టుకుని
శరీరం మొద్దుబారుతుంది
తడి గుండెను తలగడ కింద పెట్టి
తన్మయం చెందుతుంది
మనసులో పాటలల్లుకుంటూ
మట్టిపొరల్లో మందు కూరుతూ
సిగ్నల్‌తో ఎలర్ట్ అవుతుంది
ప్రాణాలు చెరపట్టే చిత్రహింసలో
పాతరను మించిన శబ్దమేముంటుంది

జీవితానికీ
జీవితానికీ

ఎంతో తేడా
మాటలమ్ముకొని
ప్రేమలమ్ముకొని
సహజ నదికి సంకెళ్లువేసి
బతుకు బరువెక్కుతుంది
బీభత్సకాండకు భీతిచెంది
బలుసాకు తింటూ
బండి లాగుతుంది
చావుని చేతి కంకణంగా ధరించి
స్వర్గాన్ని కష్టజీవులకు బహుమానం ఇవ్వాలని
ఓడిపోని యుద్ధం చేస్తుంది
మానవ సంబంధాలు మసిబారిన రాజ్యాన
త్యాగం కంటే సౌందర్య మేముంటుంది?

*15-12-93 ఉదయం*



# దృష్టి

పూలనేమంటాం?
తేనె తాగి
మోతపెడుతూ మొఖమ్మీదెగురుతున్న
తుమ్మెదననాలి గానీ -

పత్తినేమంటాం?
తెల్లగా మెరుస్తూ
ఖాదీ ముసుగు చాటున కసాయితనం కక్కుతున్న
రాజకీయుల్ననాలి గానీ -

మాటనేమంటాం?
పసితనంలో పలుకు పలుకున ముద్దులొలికి
బుద్ధితెలిసేకొద్దీ అర్థాలు మార్చి మార్చి
అసహ్యాన్ని అలుకుతున్న
కిరాయి రచయితల్ననాలి గాని -

ఆయుధాన్నేమంటాం?
నిదురపోతున్న వెలుగును
రాత్రికళ్లతో చుట్టుముట్టి హత్యచేసే
ఎన్‌కౌంటర్ కళాకారుల్ననాలిగానీ -

*15-9-93 సాయంత్రం*

# వొంగిన ఆకాశం

1

దుఃఖం పంచుతున్నట్టు
హాలంతా తడిసిపోతుంది
కొత్తకాంక్షల్ని వడుక్కుంటున్న
డిసెంబర్ 31
విఫలయోగ విషాదరాగంలో అల్లాడుతుంది
భర్తను కోల్పోయిన భార్య
కొడుకును పోగొట్టుకున్న తల్లి
అన్న దూరమైన చెల్లి
స్టేజి మీద ఎన్నెన్ని ఆక్రందనలు విదారించాయి
'డాడీ ఆఫీసు నుంచి రాడా
మనమే ఆఫీసుకి పోదాం అంకుల్'
లోకం తెలియని పసివాడి ముద్ద ముద్ద మాటలు
విన్పించినపుడు
ప్రెస్‌క్లబ్ ప్రేక్షకులంతా
తడి కళ్లయి టపటపా రాలిపడ్డారు

మిత్రుడిచ్చిన నినాదాలు
గంభీరమైన చేతులు చాచి
మనల్ని ఊరడించి ఉద్రేక పరుస్తాయి
ప్రతిజ్ఞలూ ప్లెకార్డులూ బైఠాయింపులూ
సియం ఇంటిదాకా ఊరేగింపూ
తోపుడు ఊయల్లో నెలల పసికందు
ఎందర్నో కరిగించవచ్చు
ఏలినవారి కెక్కడిది జాలి?

పెంపుడు జంతువులు మాత్రం
గర్వంగా
మీసం మెలేస్తాయి

2

వొంగిన ఆకాశం వాళ్లిద్దరిమీదే
విరుగుతుందని ఎవరనుకున్నారు
అక్షరం రాస్తున్న మధ్యలో
సిరాముద్ద కూలి చిన్నాభిన్నం చేస్తుందని
ఎవరు కలగన్నారు
వార్తలు సేకరించటానికి వెళ్లిన విలేఖరి
సంచలన వార్తవుతాడని ఎవరనుకున్నారు

రంగుల ముద్ర వొచ్చిందా
ఎన్‌కౌంటర్ రక్తం
మొదటి పేజీనిండా ఎర్రగా అలుక్కుపోతుంది
రోజూ అరుణవర్ణ ముద్రాంకితాలే

ఎవ్వరూ నిజాలు రాయొద్దు
ఎవరూ నిజాలు మాట్లాడొద్దు
సరదాగా వేళ్లు విరుచుకున్నట్లు
జవాన్లు మనసు విరిచేస్తారు
నిన్నటిదాకా కథలల్లిన తుపాకులు
ఇవాళ వార్తలు వండుతున్నాయి
కుంభకోణాల్ని వేళ్లకుంగరాల్లా ధరించినవాడు
తలెత్తుకునే ఉంటాడు
సత్యాన్ని వెలికితీసి వార్తలు రాసిన చేతులు
మజీద్‌గూడాలో దిక్కులేకుండా తెగిపడతాయి

3

రసూలూ కాదు
రాజయ్యా కాదు
మూగవాడికి మాటయిన కలాలు రసూలు
మాటొచ్చినవాన్ని మూగవానిగా చేసే తుపాకులు రాజయ్య
రక్షణ కరువైనవాళ్లకూ
రక్షకులకూ ఘర్షణ
ఇవాళేనా? ఇంత రాక్షసత్వమా అని ప్రశ్నిస్తున్నాం
తెలంగాణా పల్లెటూళ్లని వల్లకాళ్లు చేసి
ఊరూరా రక్తం వెదజల్లి
విలేఖరులు రాయలేని

కవులు గాంచలేని
ప్రాణభయ సన్నివేశాలెన్ని?
గుర్తు తెలియని శవాల్ని చూపని రోజేది
చిత్రహింస మోయని ఊరేది
కన్నీరు కార్చని ఊరుందేమో
కాల్పులు వినని ఊరేది

దండలు వేసుకోవటానికి అలవాటుపడ్డవాళ్లు
శవాల దండలయినా సరే
మెడలు చాస్తారు
ఇవాళే
ఇంత రాక్షసత్వం కూడా వుంటుందని మనకు తెలిసింది

4

మాటలేని
మాట్లాడలేని సమయంలో
ఎందరికో మాటయినాడు
మాట్లాడే సందర్భమయినాడు రసూల్
మాట భిక్ష పెట్టాడు
ప్రాణభిక్ష పెట్టాడు
'ఎన్‌కౌంటర్లన్నీ హత్యలే' అని
అందరి గొంతులో నినదించాడు రసూల్
సత్యం ఎంత అబద్ధంగా మారిందో చెప్పటానికి
అదృశ్యదృశ్యమయినాడు
రాక్షసత్వం ఎంత భయానకంగా ఉంటుందో చెప్పటానికి
మరుపురాని సాక్ష్యమయినాడు

మంచు కప్పితేనో
మసకబారేది మనిషితత్వం కాదు
మన అక్షరాల్లో రసూల్ లేడా
మన మాటల్లో రసూల్ లేడా
మన ఊరేగింపుల్లో రసూల్లేడా
రసూల్ ఒక్కడేనా...

*27-2-92 తెల్లవారు జాము*



# సగంచావు

ఒక కొమ్మ విరిగిపోయినా
యాప చెట్టు చెదిరిపోదు
కందిని వెలుగులో కన్నీటి ముత్యాలు రాలిపడే
నిశ్శబ్ద దృశ్యం కనిపించదు

తూట్లు పొడిచే చలి
ఎందర్నో వణికించే చలి
అంగీలేని శరీరం ముందు
సిగ్గుతో ఓడిపోతుంది
బురదలో పనిచేసే చేతులు
గోచికంటిన
బురద మరకలు పట్టించుకోవు
మూడోసారి
గుడిసె తగలబెట్టడానికి వచ్చినవాళ్లకు
పాతగుండె కొత్తజవాబు చెప్పలేదు
కన్నందుకు
కన్నీళ్ల రుచి తెలిసినందుకు
భుజం కాయలు గాసే క్షణంతో
బతుకును వొత్తుకోవటం అలవాటయింది
బర్రో గుంజకు
దుడ్డో గుంజకు
బాపురుమంటున్న చప్పుడు అలవాటయింది

★ ★

దేవులాటలో
దేవుడు యాదికొచ్చినప్పుడల్లా
కండ్లొద్దనీ
నోరొద్దనీ - అరవై సంవత్సరాల్ని కప్పుకున్న శరీరంతో
ఇప్పటికీ మొత్తుకుంటనే వున్నా

నాకూ నాలాంటి కోట్లమందికి
రెండు రెక్కలు తప్ప
ఏమీ వుండొద్దనీ కోరుకుంటనే వున్నా
రెక్కలు పడిపోయేనాటికి
రెక్కలొచ్చిన బిడ్డని మనసుపడ్డాను
పసిమొఖంలో ఉదయించే తెలివిని
పసిగట్టి వెన్నెల కురుస్తుందనే అనుకున్నాను
వానలుపడి
భూమి బుసబుస పొంగి
చెర్లు నిండుతయనే అనుకున్నాను
అందరూ వొద్దంటుంటే
పలకా సంచితో నడిచిపోతున్న
పాలబుగ్గల్ని ముద్దాడాను
ముద్దులు మూటవుతాయని చేయిచాపేసరికి
నిప్పు కాలింది -
కొడుకు వినడు -
పోలీసులు వినరు -
తలకు రుమాలుతో పాటు అవమానాలు చుట్టుకున్నాను
చిరుగుల ధోతిలో
సిగ్గొక్కటే కాదు
ఎన్నో దెబ్బలు దాచుకున్నాను
రెప్పలకింద మెరిసిన కల
తెల్లారకముందే కాలిపోయింది
ఎముకలు విరిగినచోట
తోలు సాగి
వృద్ధాప్యం ఊగుతోంది
ఎన్నిసార్లు చచ్చాను
ఎన్నిసార్లు చెప్పాను
నాక్కొడుకు లేదు - లేదు -
కొడుకున్నా



చిన్నప్పుడే తల్లి పేగుకోసుకున్నది
ఇప్పుడు నేను పేగుకోసుకున్నా
వాన్ని నరుక్కోండి చంపుకోండి
వాని రక్తం
మీ గొప్ప గొప్ప పోలీసు స్టేషన్ల నిండా రుద్దుకోండి
మీ పేపర్లలో పెద్ద పెద్ద అక్షరాల్లో రాసుకోండి
మా తెరువు రాకండి
నెలకోసారి మా ముసలి ప్రాణాలు తోడకండి

★ ★ ★

దేవుడు కొట్టినా
పోలీసులు కొట్టినా
దెబ్బలతోనే రాలిపోతుంది శరీరం
కొడుకు శవాన్ని
గుర్తించటానిక్కూడా చూపు ఒప్పుకోవటం లేదు
ముసలి జీవితానికి
ఇంకా ఎన్నిసార్లు గుడిసె కప్పుకుంటాడు
మనసు చంపుకున్నట్టే చంపుకుని
వాకిట్లో కూలబడిపోయిన
ముసల్దాన్ని లేవనెత్తలేడు
ఏడువొద్దని ముసల్దాన్ని ఓదారుస్తూనే
మీదపడి బావురుమంటాడు
విరిగిపోయిన రెక్కల్ని చూసుకుంటూ
రెక్కలుప్ప మరేమీ వొద్దని
రెండు కన్నీటి బిందువులు
మౌనంగా వేడుకుంటాయి

22-12-93 సాయంత్రం

# రెండు నాల్కల మాయ

రెండు మూతుల పాముని చూశాం
బతకలేదు
రెండు తలల వింత శిశువుని చూశాం
బతకలేదు
పది తలల రావణుడి పురాణం విన్నాం
బతకనే లేదు
ఒక్క తలలోనే
రెండు నాల్కల మనిషి వర్ధిల్లుతున్నాడు - జాగ్రత్త

సగటు ఓటరు అరచేతిలో
సగం స్వర్గం దించి
అందమైన కలల తోటను అమాంతం మెడలో వేస్తాడు
ఉక్కిరి బిక్కిరై ఓటరు
ఒంటిమీది బట్టలు కూడా చూసుకోడు
తెల్లారేసరికి
పూరిళ్లనీ గుడిసెల్నీ వెక్కిరిస్తూ
ఒక బుల్డోజర్ సిద్ధమవుతుంది
బడుగుజీవి రెండు కళ్లు భళ్లున బద్దలవుతాయి
దేవుడిచ్చింది రెండు కళ్లు
ఎక్కువ ఏడ్వాలి
దేవుడిచ్చింది రెండు చెవులు
ఎక్కువ వినాలి
దేవుడిచ్చింది రెండు చేతులు
ఎక్కువ పనిచేయాలి
దేవుడు ఒక్కటే నాలుకిచ్చాడు - ఏమీ మాట్లాడకూడదు
మనకేమీ మాట్లాడకూడదని చెబుతూనే
వాడెప్పుడూ మాట్లాడుతుంటాడు



వానలు కురవవు
రేడియోలో టీవీలో
వాని సందేశాల కృత్రిమ వర్షాలు కురుస్తాయి
వాతావరణంలో తేమ తక్కువయినప్పుడల్లా
వరుసగా 'సంక్షేమ పథకాలు' ఫైళ్లలోంచి ఉబుకుతాయి
ఎరువులు వెదజల్లింది వాడే
సబ్సిడీ రుచి చూపించిందీ వాడే
కోలుకునే సమయానికి
ఎరువుల సబ్సిడీ తీసేసి ఎగతాళి చేశాడు

ఉన్న చిక్కంతా ఇక్కడే

చదువులేకనే దేశం కుంటుపడుతుందని ఒక అంచనా
నెరిసిన వెంట్రుకలకు 'అక్షరాస్యతా పథకం' రంగు వేస్తాడు
ప్రచార ర్యాలీలు ప్రదర్శనలతో పల్లెలు బీరిపోతాయి
పథకం మొదలయిననాడే
మంత్రిగారి పేరా కలెక్టరు గారి పేరా
ప్లాట్లు రిజిష్టరవుతాయి
పోలీసులు గస్తీకి రాత్రి బడులు జడుసుకుంటాయి
ఉపాధ్యాయుల వలసతో ఉన్న బడులు వడలిపోతాయి
పెద్దల విద్య ఏమోగానీ
పిల్లల్ని నిరక్షరాస్యుల్ని చెయ్యటంలో వాళ్లు సఫలమౌతారు

వాచ్చిన చిక్కంతా ఇక్కడే

'రెండు రూపాయలక్కిలో బియ్యం' ఆకర్షణీయమే
అదే చేత్తో వదిలిన
'రెండు రూపాయల సారా పాకిట్' బహు ఆకర్షణ కాదా
పేదవాని చెవిలో పాదుపు పూలు పెట్టొచ్చు
మూడున్నర లక్షలతో ముఖ్యమంత్రి ఒకపూట టిఫిన్ పూర్తి చెయ్యొచ్చు
నూరు నీతులు విరబూసే
ప్రజాస్వామ్య తోట ఇది

ప్రజలే దైవాలు
ప్రజలవే ప్రభుత్వాలు
ప్రజల బాగుకోసమే సమస్తం
టీవీలో ఇందిరాగాంధీ శవయాత్ర చూళ్లేదా ప్రజల కోసమే
రాజీవ్‌గాంధీ రంగుల కల చూళ్లేదా ప్రజల కోసమే
పీవీజీ రామరాజ్యం
క్లింటన్ బూట్ల భజనలో
సాయిబాబా పాదార్చనలో
తన్మయం చెందుతుంటే చూడటం లేదా

పరిచినవన్నీ అందమైన కలలే
పావురాలు చిక్కుకునే సమయానికి
వేటగాడు బయల్దేరుతూనే ఉంటాడు
ధర్మం నాలుగు పాదాలతో నడుస్తుందట
ఎప్పుడు ఏ పాదంతో ఎవరిని తంతుందో మన ఊహకందదు
దేశ్ కి రక్షా కౌన్ కరేగా కౌన్ కరేగా
హమ్ కరేగా హమ్ కరేగా
హమారే రక్షా కౌన్ కరేగా
హర్షద్ మెహతా కరేగా
అంబానీ కరేగా
అమెరికా బిగ్‌బాస్ కరేగా

ప్రజల్ని రక్షించటానికే సైన్యాలూ పోలీసులూ
సరిహద్దు సైన్యాలు దిగిన రోజునే
గ్రామీణ యువకుల బతుక్కి ఉరిపడుతుంది
గిరిజన యువతి కేక గాల్లో గింగుర్లు కొడుతుంది
మినుకు మినుకుమనే గుడిసెలు మసిపాతలవుతాయి
ప్రధానమంత్రి ఒకప్పటి ఇంటిముందు
భద్రతా దళాలు తీరిగ్గా వాలీబాల్ ఆడతాయి

ప్రజాప్రతినిధే సుమా
ప్రజలకంటే ఎక్కువ గన్‌మెన్‌లనే నమ్ముతాడు
ఉన్న చిక్కంతా ఇక్కడే



పేదవుల మీద అహింసా మంత్రజలం
శాంతి పావురాల మెడలో చిట్టీలు కట్టి ఎగరేస్తారు
అవి ఎగరగానే
అదేచేత్తో సాయుధ ముఠాలకి సైగచేస్తారు
వొచ్చిన ఇబ్బందంతా ఇక్కడే
చంపినా కేసులుండవని ఎస్పీ ప్రకటిస్తాడు
చంపేముందు స్టాంపులతికించటం మంచిది
గాంధీ విగ్రహం ముందు
మీసం మొలవని విద్యార్థిని కొట్టి చంపితే కేసుందా
పగటిపూట విలేఖరిని కాల్చి చంపితే కేసుందా
ఏమీ తెలియకుండా కేసుల పాలయిన వాళ్లెందరు లేరు?

నరం లేని నాలుక
ఎటైనా వ్యాపిస్తుంది
అధికారముంటే ఏదైనా అతుకుతుంది
వొచ్చిన చిక్కంతా ఇక్కడే
రెండు నాల్కల మనిషి వర్ధిల్లుతున్నాడు
ముఖం చూసి గుర్తించకపోతే
ముఖాలు మిగలవు
నాలుకలే విస్తరిస్తాయి
చప్పరించి వదుల్తాయి

*8-9-93 సాయంత్రం*

# బహు(ళ) దాహం

అందరు నిద్రలో వున్నప్పుడు
హఠాత్తుగా మెలకువొచ్చి అతను
ఇల్లంతా చిన్నపిల్లాడిలా తడుముతుంటాడు
కష్టపడి కట్టుకున్న నాగటి దుంప కనిపించక
కలత పడుతుంది
ఎన్నేండ్లొచ్చినా లోకం తెల్సుకోని ఎడ్డి మనసు
తంగెడు పొదలో దాసుకున్న
సీతాఫలాలు తలపుల్లోనే మిగులుతాయి
చింత తోపులో ఎంత వెతికినా
గొర్రింకల గునగునార్భటుల గుర్తులన్నా ఉండవు
చొప్పజూడులో జొన్నకంకి మాయమై
చెరవోయి పండించిన రైతుకంట్లో
కోసిన కొయ్యకాళ్లే గుచ్చుకుంటాయి

కోడి కూస్తుందని ఎదురుచూసి
అద్భుతమైన ఉదయాన్ని కోల్పోయాడు రైతు
ఫారం కోళ్లకు ఎప్పుడు కూయాలో తెలియదు
షెడ్డులో బంధించబడి
లైట్ల వెలుగులో వాటికి
రాత్రీ పగలు ఒక్కలాగే వుంటాయి

చాకిరీ చట్టుబండలు మోసి మోసీ
నడుములు విరిగినట్లు
రైతు కలలు ఎప్పుడో విరిగిపోయాయి
రైతు బతుకులో ఇప్పుడు ఇసుకమేట వేస్తున్నది
తెలివిమంతులు ఉపాయశాలి మేధావులు
పెట్టే ఉరుల్లో చిక్కుకుని
అతను వలపోస్తున్నాడు
ఋణాలిచ్చి తనతోనే గోతులు తవ్వించి



అతని కష్టాన్ని పాతర వేస్తున్నారు
ఇనుప మొఖం వాడికి ఎంత పెత్తనమైనా చాలదు
ఇక్కడి విత్తనాలు వాడిష్టమేనట
వాడిష్టంతోనే ఇక్కడ పంటలు పండాలట
భూమ్మనదే
కష్టమ్మనదే
వొచ్చే సర్వసంపద మాత్రం వాడిదట

★ ★

బతుకమ్మ పండుక్కి తంగెడు పువ్వు దొరక్క
తబుకు చిన్నవోతుంది
దసరా హుషారులో జెండా కింద జొన్నకర్ర దొరకక
ఊరు నిట్టూరుస్తుంది
జంబీ జాజిపత్రి ఏవీ ఉండవు
సంక్రాంతి గొబ్బిళ్లముందు ఏ ధాన్యం పెట్టాల్సి వస్తుందో
ఇగ ముందు మనకెవరికీ తెలియదు
పిల్లలకి కోతికొమ్మచ్చి ఆటే వుండదు
అన్నీ నీలగిరి చెట్లే మరి

అన్ని రంగాలు వాడి ఫైల్లో కాయిదాలయ్యాయి
ఇగ - వ్యవసాయం వెంబడి బడ్డాడు
రైతులో ఇంకా ఏం మిగులుందని కొల్లగొడతారు
భోలాశంకరుని బొమికెలమీద
ఒక దేశం పాలకులు
ఇంకొక దేశం విడిచిన బట్టలు ఆరేస్తారు

వ్యక్తిత్వం లేని రాజకీయులకు
అమ్ముకోవటమొక్కటే గదా తెలిసింది
అమ్ముకోండి ఆత్మను అమ్ముకోండి
రైతు నోట్లో కొట్టటానికి ఇంత మట్టికూడా అమ్ముకోండి
దేశ గౌరవం గురించి
మందిరమంత నోటితో అరిచేవాళ్లకు
తాకట్టు పడుతున్న రైతన్న

తలపులోనన్నా రాడు
రాసివ్వండి
మీ ముల్లేం పోయింది - రాసివ్వండి
కష్టాన్ని నమ్ముకున్న నేరానికి
మట్టిని నమ్ముకున్న పాపానికి
నోరులేని అతని బతుకుమీద అన్ని హక్కులూ రాసివ్వండి
ఇక్కడ మొలిచే మొక్కల మీద
తీరైన చెట్ల సోయగాల మీద
పులకించి వొయ్యారంగా వూగే పంటచేల మీదా
కిలకిలలాడ్తూ ఎగిరే పక్షుల మీదా
అవి తినే పాలగింజల మీదా
మీ పాపాలు రాసివ్వండి

రైతు బతుకులో ఇంకేం మిగిలిందని
గడికీ మంట పెడతారు
ఒక్కసారే అతన్ని తగలబెట్టి చలిగాసుకోండి
మీ ఢిల్లీ పీఠాలు వెచ్చబడుతాయి
మీ కార్లు భద్రం
స్విస్‌బాంకులో మీ ఖాతాలు భద్రం
మీ కొడుకుల రాజకీయ భవిష్యత్తు భద్రం
మీ భార్యల బంగారు వన్నె వన్నె ఆభరణాలు భద్రం
సంపాయించటమొక్కటే గదా ఏలినవాళ్లకు తెలిసింది

రైతన్నా
నీతిలేని వాళ్లు పాలించే రాజ్యంలో పుట్టినందుకు
బాధపడాల్సింది మనమే
సిగ్గులేనివాళ్ల చేతిలో అధికారం పెట్టినందుకు
సిగ్గుపడాల్సింది కూడా మనమే

7-1-93 ఉదయం

*(మన పంటలు, మొక్కలు, మొదలైన సమస్త జన్యుకణాల పేటెంట్ హక్కుల దురాక్రమణ ద్వారా భారత గ్రామీణ అస్తిత్వానికే ఎసరు పెట్టిన డంకెల్ ప్రతిపాదనలకు వ్యతిరేకంగా)*



# కళేబరాల కన్నీరు

లెక్కలున్నపుడు
తప్పుడు లెక్కలుంటాయి
రాత్రులున్నపుడు
కాళరాత్రులంటాయి
భూములున్నపుడు
భూకంపాలుంటాయి
మాటవరసకి అంటూ
మాటలు మోసం చేయగలవు
రాత మార్చగలమా అంటూ
రాతకోతలు ద్రోహం చెయ్యగలవు
మనసూ మమతా అంటూ
మనిషి మోసం చెయ్యగలడు

మరిచాడు -
నీడనిచ్చి నీళ్లిచ్చి నిద్రపుచ్చి
భూమి మోసం చెయ్యగలదని మరిచాడు
బేలతనం కాకపోతే
పంటల మీద పండు వెన్నెల కాయగానే
పరవశమై పోవాల్నా -
పొద్దుతిరుగుడు గింజలమీది ఆశతో
పొంగిపోవాల్నా -
చెరుకు తీపి
బతుకు తీపి కలిసి
చేదుమాత్రలవుతాయని మరవాల్నా -
మనసారా నమ్ముకొన్నందుకు
తల్లీ అని కండ్లకద్దుకున్నందుకు
చావకుండానే బొంద తవ్వకుండానే
మట్టిపెళ్లై రాలుతుందని మరిచాడు
ఓ ఇల్లుండాలని

ఇంటికోసం ఎంత ఆరాటపడ్డాడు
కష్టపడి కట్టుకున్న ఇల్లే
కడకు సమాధి కాగలదని మరిచాడు

ఏం చేయగలడు?
రాళ్లు కదుల్చుకోలేకా
కూలిన గోడలు జరుపుకోలేకా
సగం మొఖం బయటపెట్టి అరుస్తున్నాడు
శిథిలాల కుప్పలకింద
ఎన్ని మూలుగులు వినిపించగలడు అల్ప మానవుడు
చనిపోతే శవయాత్రలో ఏడ్వడానికి వారసులెవరూ మిగల్లేదు
బతికితే అతడు తిరుగాడిన అతడి ఇల్లేదో
పోల్చేకోలేడు
దొరికిన చెయ్యి ఎవరిదో
కాలెవరిదో

★ ★

టేబుల్ మీంచి టేబుల్ మీదికి
ఫైళ్లు గెంతుతుంటాయి
రేడియోలోంచి పత్రికల్లోంచి
వార్తలు పాకుతుంటాయి
చచ్చిపోయి వాళ్లేడుస్తుంటే
కార్ల రొద హెలికాప్టర్ల రొద మరింత చంపుతుంది
ఇంతకూ తేలిందేమిటి?
ఇంతమందీ తేల్చిందేమిటి?
లెక్కల పట్టింపులేనా
ఎందరు చచ్చారనేనా
ఎన్ని ఊళ్లు పోయాయనేనా
ఒక కాట్లో ఎందర్ని కాల్చారనేనా
విరాళాలు ఎంతొచ్చాయనేనా
లెక్కలున్నపుడు తప్పుడు లెక్కలుంటాయి



దొంగలు శవాలమీద నగలేరుకోవచ్చు
రక్షకులు పాలతో స్నానం చెయ్యొచ్చు
పునిస్త్రీకి కదా పుస్తెలు -
ఇప్పుడెవరయినా తెంపుకోవచ్చు
చనిపోయేవాడికి ఇళ్లెందుకు
కాంట్రాక్టర్లు కట్టుకోవచ్చు
చందాలు దాచుకోవచ్చు
పర్యటన పేరుతో
మంత్రులు టీవీలో మరోసారి కనిపించొచ్చు
ఒరిగిందేమిటి?

బాధితుల ఆక్రోశాలకు బదులేది
కొయినా డ్యాం కొల్లగొట్టిందెవర్ని
కుర్ది వంతెన కూల్చివేసిందెవర్ని
గొట్టపు బావుల్లో విరిగిందెవల రెక్కలు
ఉపాయం చేసిన మేధావులూ
ఉరులెవరు పెట్టారు?

చెట్టూ పుట్టా మనిషీ శవమూ నీరూ నిప్పూ
ఒకటయి అడుగుతున్నయి
నిజం ఎవరు చెబుతారు
కళేబరాల కన్నీరు ఎవరు తుడుస్తారు

6-10-93 సాయంత్రం

# అవిటితనం

అప్పుడు ఒక మబ్బుతునక వొంగి
చటుక్కున గొడుగు పడుతుంది
చిమచిమలాడుతున్న గాలి
నెమలీకల్తో తనువంతా తడుముతుంది
నునుపైన చెక్కిళ్లమీద ఒలుకుతున్న
కన్నీటి జలను పావురం రెక్కల్తో వొత్తుతుంది
పూలతోటంతా ఒకటే పులకింత
అప్పుడు జీవితం తొంగిచూసి
ఒకరాయి విసురుతుంది
కిలకిల నవ్వుతున్న పూలకు
కాడలు రాలి ఉంటాయి
బంగారు వన్నెలో నవ్వే గోరింకల కనులు
మూసుకు పోతాయి
ముద్దులొలికే చిలుక పలుకులు మూగవోతాయి
అప్పుడు శాంతించి
ఎగాదిగా చూస్తున్న జీవితాన్ని చూసి
ఎక్కిళ్లు పడుతుంది హృదయం
ఓదార్చటానికి లోకానికి చేతులే ఉండవు
అప్పుడు కవి తడిసిన గొంతులోంచి
ఒక పాట ఉబుకుతుంది

తమ్మీ మీరు తల్లడిల్లొద్దు
వసివాడని అందాల పూలు మీరు
గొంతులేక మాట్లాడలేకపోవచ్చు
అది మీ నేరం కాదు
మాట్లాడటం చేతనై మాట్లాడలేం మేం
గొంతుండీ మూగతనంలో మాగిన మాకంటే మీరే నయం
మాటల్తో మనిషిని బోల్తా కొట్టించే మోసగాళ్లం మేం
అతనో దుకాణం తెరిచీ
నేనో దుకాణం తెరిచీ



మేం అణాల భాష
దుకాణాల భాష తప్ప అన్నీ మరిచిపోయాం

ఎవడన్నా సాహసించి
ఏదన్నా మాట్లాడితే
ఉన్న గొంతు నొక్కిందాకా ఊరుకోని సంస్కారం మాది
మాకన్నా మీరే నయం
సైగల్తోనయినా సంభాషించి తీరుతారు

చిగురాకు దోనెలో నిలిచిన మంచు బిందువులు మీరు
చూపులేక చూడలేకపోవచ్చు
అంధత్వం నేరం కాదు
మిలమిల మెరిసే నేత్రాలుండీ
చూపులుండీ చూడలేని కబోదులది అంధత్వం
లాభదృష్టి తప్ప
మరే దృష్టీ లేనివాళ్లం
చూసినా వొయారాల మీదో వోణీల మీదో అతుక్కుని
బల్లిలా నాసపెడుతుంటాయి
న్యాయదేవత కళ్లకు గంతలు కడ్తాం
సాక్షుల కళ్లు కిరాయికి తీసుకుంటాం
తప్పనిసరైన చీకట్లో మీరు
చీకటి బజారులో మేం

సాహసించి
వెలుగును చూసినవాళ్ల కన్నుల్లో
ఆసిడ్ పోయటం మా విద్య
మాకన్నా మీరే నయం
మనసుతోనన్నా మల్లెపువ్వు చూడగలరు

పాదులలో తిరిగే నీటికాలువహొయలు మీరు
చెవిటితనం చిన్నతనం కాదు
చెవులు సజావుగా వున్నా
వినలేని వికారమే చెవిటితనం
నీతులు వినం నిజాలు వినం గిజగిజలాడే ఆర్తనాదాలు వినం
విన్నా చాడీలు వింటాం సైరన్లు వింటాం

గోడకు చెవులుపెట్టి గుసగుసలు వింటాం

వొద్దన్న వాడెవడయినా సాహసించి
వొద్దన్న పాటలు వింటే
చెవుల్లో సీసం కరిగించి పోస్తాం
మాకన్నా మీరే మేలు
శరీర స్పర్శతో చేమంతి కొమ్మల కోలాటం వినగలరు

మాకన్నా మీరే మేలు
చేతుల్లేకపోయినా చెక్కిళ్లమీద కన్నీళ్లు తుడుస్తారు
చేతులుండీ చేతల్లేని వాళ్లం
పారపట్టం పాదుతవ్వం
ఫైలు దులపం చెయిచాపి పిలవం
చాపినా బల్లకింద చేతులుపెట్టి అడుగుతాం
చప్పట్లు కొట్టినా కిరాయి అడుగుతాం
నోట్లు లెక్కపెట్టడానికే మాకు చేతులొస్తాయి
కన్నీళ్లోడుతున్న కలికి శరీరమ్మీద
కిరోసిన్ చల్లి అగ్గిపుల్ల విసరటం కోసం మా చేతులు నిరీక్షిస్తాయి
కత్తులు పడతాం
కాకపోతే కాసులు పడతాం
చెయ్యెత్తి జైకొట్టినవాడి చేతులు తీసేయటం మా వారసత్వం

మందబుద్ధులయినా మీరే నయం
బుద్ధిని బుద్ధిపూర్వకంగా తాకట్టు పెడతాం మేం
బుద్ధిజీవుడైనా కాదంటే
వాడి ప్రాణం వొలిచి
వాడి అరచేతిలో పెడతాం

తమ్మీ! అవయవం లేకపోవటం
అవిటితనం కాదు
ఉన్న అవయవాన్ని
ఉపయోగించకపోవటం నేరం
ఉపయోగించినా
మహోన్నత శిఖరాల మీద తోట నాటి
మనిషికి పట్టం కట్టక పోవటం పెద్ద నేరం!

*20-1-1995 నడిరాత్రి*



# తెగనిరాత్రి తెగినపాట

తెగని రాత్రుళ్లకు అడ్డంగా
కలల కాలినడక
వాళ్ల నడకముందు
బాటలు వెనకబడతాయి
వాళ్ల దీక్షముందు
చిమ్మచీకటి వెలుగవుతుంది
పచ్చనాకుల పారవశ్యంలో
గాలి గొంతులోంచి
పురివిప్పిన కమ్మటి పాటలు
వాళ్ల రాకకు మైమరచిపోతాయి

పాట కట్టుకోవటం కంటే
తల ఎత్తుకోవటం కంటే
జీవితంలో ఆనందమేముంది?
ఏడుపు తప్ప
ఇంకేమీ మిగలని
ఎండు చేపల్లాంటి కళ్లలో
రెండు ఆశలు పండించటం కంటే
ఎవరి జీవితానికయినా తృప్తి ఏముంది?

తలమీద తట్ట
తట్టలో సద్ది
సద్దుమణిగిన జాము
సద్ది మోసుకొచ్చే తల్లి
మనసులోని మమతాక్షరాల మౌనభాషను
చదవటం
ఏ పండితుడికి చాతనవుతుంది
పాలిపోయినవాళ్ల చెక్కిళ్లు నిమిరి
ఆ తల్లి కణతలకు వేళ్లు విరుచుకున్న

మహత్తర అనుభవం
ఏ రవి కాంచగలడు? కవి గాంచగలడు?

ఆకలిగొన్న కడుపు
అన్నంలో ఈదటం చిన్నదేమీ కాదు
నడకలో అలిసిపోయిన వాళ్ల పాదాలు
రెప్పలు ముడివడుతున్న వాళ్ల కళ్లు
అట్లా విశ్రమించి ఆనందపుటంచులు చూస్తాయా...
కుట్ర!
గాలిని 'సడి' చేయమని రాసిన కవీ
రాజుదొక్కడిదే బడలికా
రాజుదొక్కడిదే నిదురా
నిదురించే శరీరాలమీద
తుపాకులు కుప్పలు కుప్పలుగా కురిస్తే మాట్లాడవేం కవీ
పాటలల్లవేం కవీ

పక్షులు బుగులుతో దాక్కున్నాయి
పరికి పొద పొరకల్లో ఆకులల్లాడినయి
నిద్రించే గుండెల్ని చీల్చటాన్ని కూడా గురి అందామా
సిగ్గువిడిచిన భటుల్ని చూసి సూర్యుడు సిగ్గుపడతాడు
నిద్రించేవాళ్లను చంపి
నీతికథలు చెప్పే
రాజ్యానికి
మొఖముందా
ఉమ్మిపడకుండా మిగిలుందా

*20-4-94 సాయంత్రం*



# ఆయువుపట్టు

వెనుకా
ముందూ
నక్షత్రకాంతి

కదలనంటే కదలదు
కొయ్యబారిన పావురాల గుంపు
పారే కాలువకూ
పంటచేనుకూ మధ్య
ఏదో తెగిపోయినట్టు
ఎక్కడలేని శోకం

నాగలి నడిచినచోట
విత్తనాలు నాటినచోట
తూటాలు చల్లుతున్న పాపిష్టి చేతులు
మొండిగోడ మీద
మొక్కవోని వజ్రం
మాట్లాడదు - మాట మార్చదు

వెనుకా ముందూ వేడి నక్షత్రకాంతి
పారే నదులు నిలబడి
నిక్కి నిక్కి చూస్తాయి
స్పర్శలో పులకించిన చెట్లు
చెవులొగ్గి ఆలిస్తాయి

వెనుకా ముందూ
నక్షత్రకాంతి నవ్వు
చంద్రునికి లేని కాంతి
ఇంద్రనీల మణులకు లేని కాంతి
ఈ నక్షత్రాలకెక్కడిది?

చెమటోడ్చే చేతులు
సాదిన ప్రేమలనుంచి పుట్టుంటుంది
మంచెమీద నిలబడి.
వడిసెల విసిరిన వారసత్వం నుంచి పెరుగుతుంటుంది
పచ్చటి నవనారికత పంచి
గుండెలవిసిన రక్తంలో తడిసి
ప్రకాశం నేర్చినట్టు
అనన్యమైన కాంతి

అడవిలో చెట్టును నరకడం అలవాటైన వాళ్లకు
ఆకాశం నుంచి నక్షత్రాల్ని తుంచటం తెల్పినవాళ్లకు
తల్లి గర్భంలోని శిశువును
ముక్కలు చేసి తీసేయటం నేర్చినవాళ్లకు
చంపటం పెద్ద సమస్యా...
చంపగలరు
ప్రాణం తీయగలరు
కళ్లలోని కాంతిని తోడగలరా
కాంతి ఆయువుపట్టు తెలుసా
రక్తం
భూమ్మీద అలికిన కాంతి అని తెలుసా
బాధా క్రోధమూ
వాళ్లిద్దరూ
వాళ్లలికిన
కాంతితోనే
భూమి కదులుతోంది తెలుసా

*15-12-93 రాత్రి*



## ఏడువాలని లేదు

చేదుగా మాట్లాడానో
తియ్యగా మాట్లాడానో
మనమధ్య వెలుగుతున్న
గుడ్డి దీపం మాట్లాడి చెప్పలేదు
ఉసూరుమంటున్న పొత్తిళ్లమీద
నీడలు నాలుకలు చాచి
తూట్లు పొడుస్తున్న బాధ
గోడలు అర్థం చేసుకోలేవు
అవ్వా
రాలుతున్న చుక్కల కిందనే
ప్రేమలు రాలిపోవాలనే ఏముంది?
ఇన్నేండ్ల కష్టార్జిత జీవన పత్రాన్ని
కోనగోటితో చీల్చితే
మనిషికి ఎంత కష్టం?
అవ్వా
లొందల్లేని నేలమీద మనం నివసించాం
నీకూ నాకూ మధ్య లోయలెందుకమ్మా
ఆచారాల కొబ్బరిపీచుతో నన్ను తోమకపోతివి
ఆడంబరాల బొచ్చుకుక్కల్తో తిప్పకపోతివి
అవేమిటో
వాటి గాఢ బంధమేమిటో
ఆప్యాయతల్ని మించి
ఆత్మల్ని మించి
వాటి అవసరమేమిటో
అప్పుడైనా అర్థమయ్యేది
నీ కండ్లకూ నా కండ్లకూ మధ్య
ఈ చీకటి మొండిగోడలెందుకమ్మా

మనం తొక్కిన
మెత్తటి మట్టిబాటలో ముండ్లెవరు పోశారు

గంధపు కొమ్మలాంటి
కాయగాసిన నీ పాదాలముందు పరిచిన కుసుమాన్ని
సువాసనొస్తుందంటే ఏం చెబుతుందమ్మా
చెరుకుగడల్లా సాగిన
నీ చేతుల మధ్య ఎదిగిన పిచుకను
తియ్యగా మాట్లాడుతుందంటే ఏం చెబుతుంది
మన మెళ్లగొట్టినా
మనింట్లోంచి ఆ ఊరపిచుక వెళ్లిపోదు

చేదుగా మాట్లాడటం చేతగాక
తియ్యగా మాట్లాడవచ్చు
పాలు తీసింతర్వాత
నువ్ పిలిచి తినిపించిన
పాలగోకు మధురం మాటలో ఒలకవచ్చు
మిరప తోటలో మిరపకాయలేరి
కైకిల్తో కొనుక్కొచ్చి నువ్ వండిపెట్టిన
నూకల అచ్చురు తీపి ఇంకా నా మాటలో వుండవొచ్చు
బాయికాన్నుంచి
నువ్ గోసిలో దాసుకొచ్చిన
పచ్చి పెసరకాయల రుచి పెదవుల మీద జారి వుండవొచ్చు
అవ్వా
అనుకుని తియ్యగా మాట్లాడలేదు

దొంగ ప్రేమ గుర్తించలేని వెర్రివాళ్లమా మనం
మనల్ని
లోకమెంత ఏడ్పించిందో
కందిరీగ కాట్లతో ఎంత మంట పెట్టిందో
మరువగలమా మనం
నా శరీరమంతా ఏడుపే
మనసు దుఃఖ రంగస్థలం



ఇంటెనుకా ముంగలా
వాళ్ల కండ్లనీళ్లు నువ్వు తుడవలేదా
బాపు తుడవలేదా
నేను చేస్తున్నదీ అదే
రాస్తున్నదీ అదే
క్షమించమ్మా
నాకు ఏడువాలని లేదు
బతుకులో తీపిని పంచటానికే
కొంత చేదు మింగదల్చుకున్నాను
తియ్యగానో
చేదుగానో
తప్పనిసరిగా మాట్లాడదల్చుకున్నాను

*17-11-93 సాయంత్రం*

# ఆ పాటవిను

తెల్సిందా -
ఇప్పటికయినా
కన్నీళ్లు ఉప్పగా ఉంటాయో
చెక్కిళ్లమీద ఆణిముత్యాల్లా ఉంటాయో
ఎడతెగని కడుపుకోత రక్తం మరకల్లా ఉంటాయో
తెల్సిందా
సుందర సుస్వప్న భరితమైన మనిషిని
'చావు దుర్మార్గం' కబళిస్తే ఏమవుతుందో
చెట్టు మొదట్లో కాటుపెట్టి
కొమ్మకు తాడుకట్టి గుంజి పడగొట్టినప్పుడు
ఎట్లాంటి ధ్వని వినిపిస్తుందో
ఇప్పటికయినా తెలిసిందా

ఎవరి ప్రాణమైనా ప్రేమగా సాదుకున్నదే
మొక్క మొక్కా గొప్ప ఇష్టంతో పెంచుకున్న తోట
తోటనిండా తూటాలు చల్లితే విధ్వంసం కాదా
పంటచేలని ట్రాక్టర్లతో దున్నిస్తే విధ్వంసం కాదా
బుల్డోజర్లతో గుడిసెల గుండెకాయల్ని చిదిమితే విధ్వంసం కాదా

తల్చుకుంటే
ప్రతీకారం
ఎంత విలోమ స్వరంతో పాడగలదో వినటం మంచిది
ముద్దలు ముద్దలుగా మాంసం ఎగిరిపడితే గాని
'మానవత్వం' గుర్తురాదా?
నీదాకా వస్తేనేగాని 'చావు' ఎట్లా ఉంటుందో
అర్థం చేసుకోవా?
అన్నం పెట్టే ఆర్ద్ర హృదయానికి
చావుని అడ్డం పెట్టావే...
నడిరాత్రి వానలో తడిసిముద్దయి



వణుకుతున్న వాళ్లను
గుడిసెలో పడుకొమ్మన్నందుకు
గోడకు నించోపెట్టి కాల్చావే
బొందిలోంచి కొనప్రాణం ఎగిరిపోయేముందు
ఎట్లా తొక్కులాడుతుందో అనుభవంలోకొచ్చిందా

ఎండాకాలం అడవిలో
నీళ్ల దగ్గర కాపలా పెట్టావే
నీళ్లకోసం పానం గావరవటమంటే ఎట్లుంటదో
నీకూ తెలిసిందా
భర్తను బంధించి తన కళ్లముందే
భార్యను బలాత్కరించావే
నొసటిమీద డ్రిల్లింగ్ మిషన్ దించి
నోరెళ్లబెట్టి చూశావే
నీదాకా వస్తేగాని 'బలిమిచావు' ఎంత భయానకంగా
బాధాకరంగా ఉంటుందో చూడవా
నీ కుటుంబం దాకా వస్తే గాని
అది 'గోస' అని
కంటికీ మంటికీ ఏకధార అని తెలవదా

ఎవరికయినా ఎందుకీ ఉరి?
కావాలని చెట్టెందుకు నరుకుతావు
చెట్టంత కొడుకునెందుకు బూడిద చేస్తావు
వద్దొద్దు -
ఎవరిదయినా ప్రాణమే
ఎవరి దుఃఖమైనా దుర్భరమే
కసికళ్లతో రక్షణ వద్దు
నువ్వూ కడుపు కాలుతున్న మనిషివే
పచ్చిక మొలవాల్సిన నేలమీద
ఒలికిన కన్నీళ్లు ఇంకిన నెత్తురూ
సన్నగా పాడుతున్నాయి - ఆ పాట విను
"చిచ్చుపెట్టినవాడు చలికాగుతున్నాడు"

*29-12-93 & 17-10-94*

# వాన కురిసే దృశ్యం కోసమే

నీటికోసం అలసిపోయిన
మనిషిని లాలించేందుకు
మబ్బు
వేల చేతులు చాస్తుంది
వాన కురిసే దృశ్యం కోసమే
ఇప్పటిదాకా ఎదుర్చూసింది
చంటిపిల్లాడిని కాళ్లమీద బోర్లా వేసుకుని
స్నానం చేయిస్తున్నట్టు
గగనతలం భూమికి తలస్నానం పోస్తుంది

ముడుచుకున్న గొడుగులు
వందలాది ఒక్కసారి విరబూసి
రోడ్లమ్మటి కదుల్తుంటాయి
తడిసి వొణుకుతున్న యూనిఫామ్ పిల్లలు
ఒలుకుతున్న నీటి ముత్యాలతో
కిలకిల్లాడుతూ తేలిపోతున్న అమ్మాయిలు
వానకురిసే దృశ్యమే వేరు
ఉన్న ఒక్క గోచి ఊడబీకేసి
చినుకుల్లో చిందులేస్తున్న
గిరిజన బాలుడి పరవశమే చూడాలి
రైతు కళ్లలో
ఆనందం కురిసే ఆ దృశ్యమే వేరు

సరదా పిల్లలు పడవాట ఆడుకోవటానికి
వీధుల్లో జలాశయాలు దించి వెళ్తుంది వాన
దినమొలల్తో దిక్కులేకుండా ఉన్న చెట్లకు
కొమ్మలిచ్చి రెమ్మలిచ్చి
కోట్లాది ఆకులిచ్చి రంగు పులిమిపోతుంది
పచ్చరంగుతో హోళీ ఆడినట్లు
నేల తనువంతా ఒకటే రంగు



వాన కురిసింతర్వాత
అడవి శోభే మారిపోతుంది
నవనవలాడే ఆ శోభకోసమే
ఇన్నాళ్లు ఎదురుచూసింది

పొదలతో పొడవాటి ఆకుల్తో
చిగురు తొడిగే మన హృదయంతో
దట్టంగా అల్లుకునే దృశ్యం కోసమే
ఇన్నాళ్లూ వేచి ఉంది
నీళ్లు దొరకని గ్రీష్మంలో పరుగెత్తించి
ముప్పతిప్పలు పెట్టినవాడు
ఇప్పుడు గిజగిజా తన్నుకొంటున్నాడు
సొగసైన వనంలో
పిట్టల్ని కొట్టడానికి వచ్చిన సొగ్గాడు
దేన్నీ పొల్చుకోలేక దద్దరిల్లుతున్నాడు
వలనెగరేసుకు పోయిన పావురాల కథ తెలిసీ
వలవేసి కూచున్న పెదరాయుళ్ల నేమనాలి?

జీవోలు పట్టుకొచ్చినవాన్ని చూసి
పూలు కిసుక్కున నవ్వుతాయి
హద్దులు దాటిన అహంకారంతో
అడుగుపెట్టిన వాన్ని చూసి
గడ్డిచిల్కలు గుసగుసలాడుతాయి
వనగీతాల మీద నిషేధ రేఖలు పనిచేయవు
గడ్డిమోపులూ ఆకుపొదలూ
ఒడిచాపి ఆత్మీయుల్ని ఆదుకుంటాయి
కవాతులు చూసి జలపాతాలు జనకవు

వానాకాలం తీరేవేరు
వనశోభలో మునిగితేలే ఆ అనుభవమే వేరు
ఎంత కోరుకున్నా ఒక్క కాలమే ఎప్పుడూ ఉండదు
ఎండకాలం తర్వాత
వానకాలమే మరి

9-9-92 ఉదయం

# మేం తలెత్తుకునే వున్నం

ఊహ విరిగినపుడు
ఉయ్యాల గురించి మాట్లాడనక్కర్లేదు
పుట్టగొడుగు పురివిప్పి ఆడనక్కర్లేదు
వానపాము వాక్యాలు రాయనక్కర్లేదు
ఎండకాయమని సూర్యునికి
వర్షించమని మబ్బుకి ఎవరూ చెప్పనక్కర్లేదు
నది వెన్నుతట్టి
నడక నేర్పినట్టు ఫోజు పెట్టేవాళ్లను
వేరే అనక్కర్లేదు

మేం తలెత్తుకునే వున్నం!
కొత్తగా తలెత్తుకొమ్మంటే అది అవమానించటమే -
నడివయసు దాటింతర్వాత బంగారుపురుగును కనుక్కుంటే
            తనకదే కొత్త
            తనకదే అద్భుతం
ఆర్జించిన వాక్య శక్తినంతా ధారపోసి
బంగారలయకూ ధాతుకూ
స్తుతి వలయాలు  చుట్టవచ్చు
తెలుసా - మా బాల్యమంతా బంగారు పురుగుల్తోనే సాగింది
దారాలు కట్టి తిప్పి
దాని ఝుంకారానికి గంతులేసిన వాళ్లమే
ఇప్పుడు కళ్లు తెరచి కట్లు తెంచి
బంగారు పురుగు కన్నీళ్లు వింటున్నం!
మాకా ఆట గురించి ఎవరూ మోజు పుట్టించలేరు

మేం తలెత్తుకునే వున్నం
హింసాయంత్రాలు దించినపుడు మేం తలదించలేదు
వర్ణప్రపంచం సయ్యాటలకు మేం లొంగలేదు
మహారాజా చెయిర్లో మత్తిలిన హంసగీతాల కానుకలకు మోకరిల్లలేదు



పత్రికలు సృష్టించే కృత్రిమ మేఘాలలో ఎన్నడూ తేలిపోలేదు
మేం నిలబడి వున్నం
తలెత్తుకుని వున్నం.
మేం యుద్ధభూమిలో నిలబడివున్నం
నిర్బంధంలో నిలబడి కవిత్వం రాయటం సవాల్
అన్ని కాయిదాల మీద
అందరి హృదయాల మీద
యుద్ధ వాక్యాలు రాయదల్చుకున్నం
యుద్ధం చెయ్యటానికి తెలంగాణ మట్టి
జెలెటిన్ దట్టించి నిలబడి వుంది
ప్రాణం కోసం గడ్డికరిచే వాళ్లున్న లోకంలో
ప్రాణాల్ని గడ్డిపరకల్లో పెట్టి
కొత్తలోకం కడుతున్న వాళ్ల గురించి
కవిత్వం రాయటానికే మేం నిలబడ్డం

*22-8-92 తెల్లవారుజాము*